రాష్ట్రాభివృద్ధి పథకాలకు పెట్టుబడి: వాణిజ్యమండలి అధ్యక్షుని విజ్ఞప్తి —6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఆంధ్ర రాష్ట్రానికి తొమ్మిది మంది సభ్యులతో ఉక్కు ఇనుము సలహా సంఘం —5 వ పేజీ

THE ANDHRA PATRIKA . MADRAS. సంపుటం 41. సంచిక 122 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 3-8-1954 Reg. No.M. 1118 6 పేజీలు వెల 1 అణా.

# ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థ పై త్వరలో కొలంబో రాజ్యాల చర్చలు

## 'ప్రభుత్వాలు ప్రజలతో సన్నిహితంగా పనిచేయాలి'

### బాధ్యతగల వ్యక్తుల మధ్య సహకార భావం అవసరమని ప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, ఆగస్టు 1: ప్రజాస్వామిక వ్యవస్థలలో ఇచ్చి పుచ్చుకోడం, పరస్పరం సహకరించుకోవడం బాగా పెంపొందాలనీ, ఎప్పటికి ఏదితోస్తే అప్పటికి అది చేసే వైఖరి విజృంభించరాదనీ, మంత్రిత్వం వంటి బాధ్యతాయుతమైన పదవులలో ఉన్నవారు సర్వదా మనసులో ఉంచుకోవడం చాలా అవసరమని ప్రధాని నెహ్రూ జూలై 6 వ తేదీన ఢిల్లీ రాష్ట్ర మంత్రివర్గానికి వ్రాసిన ఒక లేఖలో వ్యక్తపరిచారు.

ఢిల్లీ రాష్ట్ర కాంగ్రెసు వ్యవహారాల గురించీ, ముఖ్యంగా రాష్ట్ర శాసనసభ కాంగ్రెసు పార్టీలో చీలికల గురించీ ప్రధాని దర్యాప్తు జరిపి సంగతి సందర్భాలు తెలుసుకున్న మీదట, ప్రధాని యీ లేఖ వ్రాశారు. ఇది నేడే పత్రికలకు విడుదల చేయబడింది.

ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వం ఎదుర్కొంటున్న చిక్కులు కొన్ని వాస్తవమైనవీ, మరికొన్ని, మానసికమయినవనీ ఇట్టి సందర్భాలలో పరస్పర సహకారం అనేది ప్రజాస్వామిక వ్యవస్థకు అత్యావశ్యమన్న విషయాన్ని మంత్రుల వంటి బాధ్యతాయుత వ్యక్తులు విదానుసరించుకోవాలనీ ప్రధాని హితవు చెప్పారు.

### ప్రజలూ, ప్రభుత్వము

[illegible]

(3 వ పేజీ చూడుడు)



ఇండోచైనా యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘ ప్రాథమిక సమాలోచనలు ఆగస్టు 1 వ తేదీన ఢిల్లీలో భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన ప్రారంభమైనప్పటి దృశ్యం. ఇందులో కెనడియన్ ప్రతినిధి ఎస్కాట్ యం. రీడ్ (భారతదేశంలోని కెనడా హైకమీషనరు) భారతదేశంలోని పోలండు రాయబారి జెర్సీ గడ్జినిస్కీ, భారత రక్షణశాఖ కార్యదర్శి ఎం. కె. వెల్లోడి, వి. కె. కృష్ణమీనన్, భారత ప్రధాని నెహ్రూ, భారత విదేశాంగశాఖ సెక్రటరీ జనరల్ ఎన్. ఆర్. పిళ్ళై ప్రభృతులు వున్నారు.

## 'మలాన్ అహంకారాన్ని సమితి అరికట్టాలి'

### దక్షిణాఫ్రికా ప్రజల సహనశక్తిని శోధిస్తున్నదని ఆఫ్రికన్, భారతీయ సంఘాల విజ్ఞప్తి

జోహాన్సెస్‌బర్గ్, జూలై 31: దక్షిణ ఆఫ్రికాలో మలాన్ ప్రభుత్వం జాత్యహంకార విధానాలను విరోధించ డానికి [illegible]

## హైనాన్ వద్ద పోలిష్ నౌకలపై అమెరికా విమానాల దాడి

లండన్, ఆగస్టు 1: హైనాన్ ద్వీపంలో [illegible]

## యుద్ధవిరమణ కృషి జయప్రదం చేసే బాధ్యత

### ఢిల్లీ సమావేశంలో కెనడా, పోలండు ప్రతినిధుల హామీ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఆగస్టు 1: "1914 లో ప్రథమ ప్రపంచసంగ్రామం ఆగస్టు 1-వ తేదీన ప్రారంభమైంది. మళ్ళీ 40 ఏళ్లకు ప్రపంచయుద్ధం అనేది లేనటువంటి కాలం ప్రవేశిస్తున్నది. ఈజిప్టునుంచి వెళ్లిపోవలసివచ్చిన యూదులు 40 సంవత్సరాలపాటు దిక్కూ, దివాణం లేకుండా అల్లాడిపోయి, చివరకు గమ్యస్థానం జేరుకోగలిగినట్లుగా, 1914 నుంచి 40 ఏళ్లపాటు యుద్ధమేఘావృతమైన ప్రపంచంలో కొట్టుమిట్టాడిన మన తరం ఇక శాంతిని అనుభవించగల

(3 వ పేజీ చూడుడు)

## మధ్యవియట్నాంలో యుద్ధవిరమణ: సైగాన్‌లో ప్రదర్శన

పారిస్, ఆగస్టు 1: [illegible]

## కాశ్మీర్ సమస్య: ఆసియా శాంతి

### పాక్ ప్రధాని ప్రసంగం

కరాచీ, ఆగస్టు 1: [illegible]

## వలసల విమోచన

### త్వరితపరచడానికి ప్రత్యేక సంఘం

[illegible]

## గోవాకు అదనపు పోర్చుగీస్ సేన

[illegible]

## రంగూన్‌లోగాని, జకార్తాలోగాని జరిగే సూచన: ఆంథోనీ ఈడెన్ ఆహ్వానానికి ఢిల్లీ తిరస్కృతి

కొలంబో, ఆగస్టు 2: ఆగ్నేయ ఆసియా రక్షణ మండలి నిర్మాణ సమస్యలను గురించి ఆలోచించడానికి కొలంబో రాజ్యాలను సమావేశపరచడాన్ని గురించి సింహళం విదేశాంగ శాఖవారు నేటి వుదయం సమావేశమై చర్చించారు.

ఈ సమావేశం రంగూన్‌లో కానీ, జకార్తాలో కానీ జరగాలని సింహళం ప్రతిపాదిస్తుందట.

ఈ విషయమై ఇప్పుడింత హడావుడి కలగటానికి కారణం బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడెన్ ఆగ్నేయ ఆసియా దేశాలకూ, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ లకూ పంపిన ఆహ్వానమేనని తెలుస్తున్నది. ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థలో ఆగ్నేయ ఆసియా దేశాలు పాల్గొనే విషయమై సెప్టెంబర్‌లో ఒక సమావేశం జరపాలని ఆయన ప్రతిపాదించారు.

[illegible] విరమణ ఒప్పందం కుదిరిన ఈ సమయంలో అటువంటి పనిచేయటం అపలేపనికిరాదు.

### సింహళం ఇండియానే అనుసరించే అవకాశం

ఇండియా జవాబు ప్రతి ఒకటి సింహళ విదేశాంగ కార్యాలయానికి [illegible]

### ఇండియా నిరాకరణ

[illegible]

## ఫార్మోజా విముక్తి

### చైనా సైన్యాధిపతి చూ టే వివరణ

లండన్, ఆగస్టు 1: ఫార్మోజాను కూడా విముక్తిని పొందించనంతవరకు చైనా సైన్యం గర్వించదగిందిగాని, ఉత్సాహపడవలసిందిగాని సంగతి తనకు ఏమీ కన్పించడం లేదని చైనా పీపుల్సు సైన్యం అధినేత జనరల్ చూ టే [illegible]

## బొంబాయిలో తుపాను హెచ్చరిక

బొంబాయి, ఆగస్టు 2: [illegible]

## శ్రీకాకుళం మంచినీటి సప్లయి పథకానికి ప్రభుత్వామోదం

### —11.5 లక్షల ఖర్చు మంజూరు

శ్రీకాకుళం, జూలై 30: పదకొండున్నర లక్షల రూపాయల ఖర్చుతో శ్రీకాకుళం పట్టణానికి పంపులద్వారా మంచినీళ్ళు సప్లయిచేసే ప్రణాళికను ఆంధ్ర ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ 11.5 లక్షల రూపాయలలో 9 3 లక్షల రూపాయలు గ్రాంటుగానూ, 2 లక్షల రూపాయలు అప్పుగానూ పురపాలక సంఘానికి ప్రభుత్వం ఇస్తుంది. 2 లక్షల రూపాయలను పురపాలక సంఘంవారి నిధినుంచి భరించవలసిందిగా ప్రభుత్వం కోరింది. ఈ ప్రణాళిక గురించి పురపాలక సంఘానికి పన్నులు చెల్లించేవారు చాలాకాలంనుంచీ ఆందోళన చేస్తూ వచ్చారు.

శ్రీకాకుళం పురపాలకసంఘానికి పన్ను చెల్లించేవారు ఈ మంచినీటి సరఫరా ప్రణాళికకుగాను 1937 నుంచి ప్రత్యేకపన్ను చెల్లిస్తూ వచ్చారు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ శ్రావణ శు॥ పంచమి 1954 సం॥ అగస్టు 3 మంగళవారం శు॥ పంచమి పూర్తి 60-0 ఉత్తర 15-2 వర్జ్యం 24-17 ల రా 2-8 కు.

శు॥ పంచమి ఆగస్టు 4 బుధవారం శు॥ పంచమి 6-43 హస్త 17-31వర్జ్యం రా 2-27 ల 4-14 కు.

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథములకు నెల్లన్.-(మహాభారతము)

శ్రీ జయ స॥ శ్రావణ శు॥ పంచమి
మంగళవారం

## సహకార సంఘాలు

గ్రామపంచాయతీలు ఆదర్శ స్థానిక స్వపరిపాలనా సంస్థలుగ రూపొంది వర్ధిల్లవలెనన్న గ్రామములలో సహకారోద్యమము బలపడవలెను. గ్రామములలో పార్టీ రాజకీయములకు, వ్యక్తిగత వైషమ్యములకు స్థానము లేకుండ చేయుట ఒక్క సహకారోద్యమమునకే సాధ్యము. పార్టీ రాజకీయములు, వ్యక్తిగత వైషమ్యములు గ్రామములను వదలనంతకాలము గ్రామ పంచాయతీలు క్రమ మార్గమున వ్యవహరింపజాలవు. సమిష్టి క్షేమంకొరకు గాక, వ్యష్టి ప్రయోజనముల సాధనకు పరికరములుగ మాత్రమే ఈ స్థానిక స్వపరిపాలనా సంస్థ ఉపయోగపడును. గ్రామముల స్వరూపమును గ్రామీణుల స్వభావమును మార్చగల శక్తి ఒక్క సహకారోద్యమమునకే గలదు.

సహకారోద్యమ స్వర్ణోత్సవ కార్యక్రమమును ప్రారంభించుచు ఆంధ్ర గవర్నరు శ్రీ చందులాల్ త్రివేదిగారు సహకారోద్యమ విశిష్టతను, సహకారవాదుల కర్తవ్యమును, సహకార సంఘముల బాధ్యతలను సంపూర్ణముగా వివరించిరి. ప్రతి గ్రామమునందును సకలార్థ సహకార సంఘములను స్థాపించి గ్రామ జీవితమునకు కేంద్రముగ ఆ సంఘములను వృద్ధిచేయవలెనని ఉద్బోధించిరి. క్రిందటి ఆదివారము ఆంధ్రరాష్ట్ర శాఖా లిక రాజధానిలో ప్రారంభమైన సహకారోద్యమ స్వర్ణోత్సవము సందర్భమున జరిగిన సభలలో ప్రసంగించుచు ఆంధ్రరాష్ట్ర సహకార సంఘముల రిజిష్ట్రారు శ్రీ సుబ్రహ్మణ్యంనాయుడుగారు నేటి సహకార సంస్థలలోవున్న లోపములను వివరించిరి. సహకార సంఘముల నిర్మాణములోను నిర్వహణములోను జరుగవలసిన మార్పులను సూచించిరి. సహకార సంఘములు ప్రజాసేవాతత్పరతతో గాక, లాభార్జన దృష్టితో వ్యవహరించిన ప్రజలమధ్య సహకారం పెంపొందుటకు బదులు, వైషమ్యములు విభేదములు ప్రబలి గ్రామములలో కక్షలు పెరుగును. సహకార సంఘముల సంస్కరణ శాసనముల ద్వారా సాధి పతిగనిగాదు. సహకార సంఘముల నిర్వాహకుల సంస్కరణ జరిగిన సహకార సంఘముల సంస్కరణ అప్రయత్నముగానే జరుగగలదు. సహకారోద్యమము దేశములో తగినంతగా విస్తరించకపోవుటకు ప్రధాన కారణము ఈ సంఘముల నిర్వాహకుల విధానమే. యుద్ధకాలములో ఈ సహకార సంఘములు కూడ ఇతర వ్యాపార సంస్థలవలెనే లాభార్జన దృష్టితో వ్యవహరించినవి. సంఘ నిర్వాహకుల పక్షపాత వైఖరివలన ప్రజలకు సహకార సంఘములలో విశ్వాసము అంతరించినది.

స్థానికసంస్థలవలెనే సహకారసంస్థలుకూడ, రాజకీయములకు లోబడక, ప్రజాభ్యుదయమునకు కృషిచేయవలెనని కర్నూలుసభకు అధ్యక్షత వహించిన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు సలహానిచ్చిరి. కాని రాజకీయవేత్తలే ప్రతి ప్రజాహిత సంస్థకు అధ్వర్యం వహించుచుండిరని, యీ సంస్థలు రాజకీయాల కాలవాలమగుటకు అదే ప్రధానకారణమని శ్రీ రామచంద్రారెడ్డిగారు గుర్తించినట్లు కన్పించదు. కనుకనే వారు సహకారసంస్థల్ని పటిష్ఠంగా చక్కగ పనిచేయవలెనన్న అధికార, అనధికార సభ్యులతో జిల్లాకొక కమిటీ ఏర్పడవలెనని సూచించిరి. ఈ కొత్తపరిశీలక సంఘములు నేటి సహకార సంఘములకు ప్రతిబింబములుగ మాత్రమే తయారు కాగలవు. ఎక్కడైనలోపములు కన్పించినప్పుడు, ఎక్కడైన సంస్కరణలు అవసరమైనప్పుడు, ఆ లోపములను సవరించి, సంస్కరణలను అమలుజరుపుటకు 'అధికార, అనధికార సంస్థలు, సంఘములు ఏర్పడవలెనని సూచించుట సాధారణమైనది. ఇట్టి సంఘములవలన ఎక్కువ ప్రయోజనము లేదని గతానుభవము హెచ్చరిక చేయుచున్నది.

అధికారులు అనధికార దృక్పథముతో, అనధికారులు అధికార దృక్పథముతో విషయములను పరిశీలించి వివిధ సమస్యల పరిష్కారమునకు ప్రయత్నించ గల్గిన ప్రజాసంస్థలన్నియు లోపరహితము కాగలవు. అధికారుల, అనధికార ప్రముఖుల దృక్పథమును సహకారోద్యమము మార్చగలదు. అందులకు ప్రత్యేక సంఘములు అవసరము లేదు. నేటి సహకార సంఘములే ఆ మార్పును సాధింపగలవు. అయితే ఈ సంస్థలు రాజకీయవాదుల హస్తగతము కాకుండ చేయవలయును. అవసరమైన, ఈ ప్రమాదనివారణకు సహకార సంఘముల శాసనమునే సవరింపవచ్చును.

ఎన్నో లోపము లున్నప్పటికిని ఆంధ్ర రాష్ట్రములోని సహకార సంఘములు చెప్పుకొనతగిన విజయములు, ఫలితములు సాధించినవి. రిజిష్ట్రారు శ్రీ సుబ్రహ్మణ్యము నాయుడుగారు తమ ప్రసంగమున ఈ వివరములను పేర్కొనిరి. సహకార సంఘములను లోపరహితముగ, ప్రజాసేవాతత్పరులైన వారితో పునర్నిర్మించిన గ్రామ జీవితము పూర్తిగా మార్పు చెందగలదు.

సహకార సంఘములను సంస్కరింపక, ఆ సంఘముల విధులను, బాధ్యతలను విస్తృతము చేసినందువలన ఎట్టి ప్రయోజనము ఉండదు. ప్రతి పంచాయితీ గ్రామమునందు ఒక సకలార్థసహకారసంఘ మేర్పడిన, ప్రజావసరములన్నింటిని ఆ సంఘములే తీర్చగలవు. రైతులు పండించే పంటలకు, ప్రజలు తయారుచేయు వస్తువులకు విక్రయశాలలను ఏర్పాటు చేసి, ప్రజలకవసరమైన వస్తువులను సరసమైనధరలకు అందించ చేయవచ్చును. గ్రామ వ్యవహారములన్నియు సహకారపద్ధతిలో, సహకార సంఘముల ద్వారా నిర్వహింపబడగలవు. అందువలన ప్రజలలో రాజకీయ మైనట్టిగాని, కుల మత ఆధారమైనట్టిగాని విభేదములు ఏర్పడక ఐకమత్యము పెంపొందగలదు. శ్రేయోరాజ్య స్థాపనకవసరము, ముఖ్యము అయిన సమిష్టి కృషి చేయుటకు ఈ ఐకమత్యము తోడ్పడును. ఆ కృషి ఫలప్రదమగుటకు అనుకూలమైనపరిస్థితులు ఏర్పడును.

## ఇండియా వాణిజ్య మహాసభ

### ఢిల్లీలో జరిగే సూచన

హైదరాబాదు, ఆగస్టు 1: ఇండియా వాణిజ్య, పారిశ్రామిక మండలుల ఫెడరేషన్ రాబోయే సంవత్సరం ఫిబ్రవరి మాసంలో ఢిల్లీలో అఖిల భారత వ్యాపార మహాసభను జరపాలని నిర్ణయించినట్లు ఇవాళ తెలుస్తున్నది. అనుబంధ సంస్థలకు, కేంద్ర సంస్థ ఈ విషయాన్ని వివరిస్తూ ఒక సర్క్యులర్ను జారీచేసింది. రెండవ పంచవర్ష ప్రణాళిక విజయానికి వ్యాపారస్థులు విరివిగా తోడ్పడే విషయం ప్రభుత్వానికీ, ప్రజలకూ వ్యక్తీకరించటానికి వీలుకలుగుతుంది. సంస్థకు సంబంధించిన ఇతర విషయాలను కూడా చర్చిస్తుంది.

## సమష్టి వ్యవసాయ పద్ధతికి ప్రోత్సాహం

### కేంద్రప్రభుత్వం లేఖ

న్యూఢిల్లీ, జూలై 31: సమష్టి వ్యవసాయపద్ధతిని అమలు చేయటానికి స్కీములు తయారు చేయవలసిందిగా కేంద్రప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వాలను కోరినట్లు తెలిసింది.

ఇటువంటి ప్రయోగాలు జరిపేందుకు పంచవర్ష ప్రణాళికలో 40 లక్షల రూపాయలు ప్రత్యేకించారు. కాని ఏ రాష్ట్రంలోనూ యీ విషయమై పని ఏమీ జరగలేదు. అందుచేత కేంద్ర ప్రభుత్వం యీ హెచ్చరిక చేసిందట. అధికోత్పత్తి సాధించటానికీ, రైతుల ఆర్థిక పరిస్థితిని బాగు చేయటానికీ యీ పద్ధతి ఉపయోగపడుతుందని ఉద్దేశించబడింది.

## పాకిస్థాన్‌లో భారతీయ చిత్రాలు

కరాచీ, జూలై 31: ఈ సంవత్సరాంతంలోగా పశ్చిమ పాకిస్థాన్‌లోకి పది, తూర్పు పాకిస్థాన్‌కి పదిమాత్రమే భారతీయ చిత్రాల దిగుమతిని అనుమతిస్తూ ఇక్కడొక అధికార ప్రకటన వెలువడింది. పశ్చిమ పాకిస్థాన్‌లోకి ఉర్దూ, హిందీ చిత్రాలు మాత్రమే దిగుమతి చేయాలనీ, తూర్పు పాకిస్థాన్‌లోకి మొత్తం పదింట్లో అయిదు బెంగాలీ చిత్రాలను తెప్పించుకో వచ్చునని శాసించబడింది.

పాకిస్థాన్ పార్లమెంటులో ఫిలిం పరిశ్రమపై నేడు తర్జన భర్జనలు జరిగాయి. భారతదేశం పాకిస్థానీ చిత్రాలను తీసుకోనప్పుడు, పాకిస్థాన్ భారతీయ చిత్రాలెందుకు రానివ్వాలని సభ్యులు ప్రశ్నించారు. పరిశ్రమల మంత్రి ఖాన్ అబ్దుల్ ఖయ్యూంఖాన్ సమాధానమిస్తూ, పాకిస్థాన్ ఫిలిం పారిశ్రామికులతో తామిమధ్య చర్చలు జరిపామనీ, భారతీయచిత్రాలు తెప్పించుకోకపోతే పాకిస్థానీ చిత్రాలు చాలక తమ మార్కెట్ పడిపోతుందని ఫిలిం పారిశ్రామికులే ఒప్పుకున్నారనీ, అందుచేత ప్రస్తుతానికి పైవిధంగా దిగుమతికోటా ఏర్పాటు చేశామనీ అన్నారు.

దేశవిభజన జరిగిన తరువాత, పాకిస్థాన్ ఏటా 80 భారతీయ చిత్రాలను దిగుమతి చేసుకొనేది. కాని గడిచిన రెండేళ్ళనుండి భారతీయ చిత్రాలు నిషేధింపబడ్డాయి. ఇప్పుడు పాకిస్థాన్ థియేటర్ల యజమానుల, డిస్ట్రిబ్యూటర్ల ఒత్తిడి మూలంగా యీ నిషేధాన్ని ప్రభుత్వం తొలగించవలసివచ్చింది.

## ఆసియా చెల్లింపుసంఘం

బొంబాయి, జూలై 31: యూరోపియన్ పేమెంట్సు యూనియన్ లాగా ఏషియన్ పేమెంట్సు యూనియన్ను ఒకదాన్ని నిర్మించడాన్ని గూర్చి ఆసియా రాజ్యాల కేంద్రీయ బ్యాంకు నిపుణులు బాంకాక్‌లో సమావేశమై ఈ నెలలో చర్చించారు.

ఇండియా తరఫున ఈ సమావేశానికి రిజర్వుబ్యాంకు పరిశోధనశాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ ఎస్. డి. దేశ్‌ముఖ్ హాజరైనారు. ఈయన త్వరలోనే ఈ విషయాన్ని గూర్చి ప్రభుత్వానికి ఒక నివేదికను సమర్పిస్తారు.

### జపాను వరిసాగు ప్రదర్శన

కాపజ్ఞ, జూలై 29:— జపాను వరిసాగు విధానాన్ని ప్రాంతీయ పుర్యోగి విన్న ఇటల ప్రదర్శించారు. వ్యవసాయ కళాశాల విద్యార్థులు, వ్యవసాయశాఖ సిబ్బంది యీ ప్రదర్శనంలో పాల్గొన్నారు. (ప్రెస్ ట్రస్టు)

## కచేరీ . . .

పని జరిపించడానికి సాధకాలం లేనప్పుడు, కొందరుకుండా కాలయాపన చేయడానికి బ్రిటిష్‌ప్రభుత్వం కనిపెట్టిన గోసాయి చిట్కా కమిటీ. ఈ కమిటీల నియామకం ఉభయతారకం. ప్రభుత్వాలకు ఊపిరి పీల్చుకు నేందుకు విశ్రాంతి నివ్వడానికీ, ఆందోళకులకు శాంతోపశాంతం చెప్పడానికీకూడా కమిటీ బాగా ఉపయోగపడుతుంది. కొంతకాలం క్రిందట గోదావరి జిల్లా బోర్డు అధ్యక్షుడు ఒకాయనుండేవారు. ఎవరైనా ఏ విషయమైనా చెప్పుకోవడానికొస్తే, అంతా విని 'చూద్దాం' అనేవారు. చూస్తారు కాబోలుననీ అర్జీదారు సంతోషించేవాడు. ఒక్క అర్జీదారుడైనా ఒదిలిపోయేవాడు కదా యని ఆయన సంతోషించేవారు. ఆ కీలకాన్నే మనప్రభుత్వం కనిపెట్టింది. గత యుద్ధంలో విమానాలు పడగొట్టే శతఘ్నులు నిండుకున్నప్పుడు శత్రువులను హడలగొట్టటానికి సముద్రతీరాన్ని తాటి బొందలు నిలబెట్టేరని ప్రతీతి. విమానాల్లోనుంచి చూస్తే అవి పెద్ద ఫిరంగుల్లా కనిపిస్తాయట. అలాగే ఏదో బ్రహ్మాండమైన పని జరుగబోతోందనే ఆశను ప్రజల్లో కల్పించి వారిని జోకొట్టడానికి కమిటీ నియామకం మహత్తర సాధనం. ప్రజలలో ఎన్నో ఆశలు కల్పించిన ఆంధ్రప్రభుత్వం ఈగోసాయి చిట్కా నుపయోగించడంలో ఆశ్చర్యమేముంది?

* * *

అసలు ఆంధ్ర ప్రభుత్వమే వివిధ రాజకీయపక్షాలతో కూడిన కమిటీ. ఈ కమిటీవారి కమిటీల సంగతి చెప్పేదేముంది? జస్టిస్ వాంఛూ చెప్పేదుకదా యని రాష్ట్రాదాయంలో లోటును భర్తీచేసుకోవడానికి మద్యనిషేధ కార్యక్రమాన్ని సడలిద్దామని కొంతవారి యాజమాన్యం క్రింద కమిటీని వేస్తే, పర్యవసానంలో ఆ కమిటీ ప్రభుత్వానికి కొరం వికారం తెచ్చిపెట్టింది. కొండనాలుకకుమందుచ్చుకుంటేఉన్న నాలుక కే ప్రమాదం వచ్చినట్లయింది. మళ్ళీ శాసనసభనాటికి ఈప్రమాదం దాటడానికి ఇంకొక కమిటీని వేయక తప్పదు. నీరా, సారాల కార్యక్రమాలను నిర్వహించడానికొక ఉపసంఘాన్ని ఏర్పాటుచేయాలి. నీరా, సారా కొనుండా కొపుదల చేయడానికి వీ నటరాజ్ గారి అధ్యక్షతతో మరొక నిపుణుల సంఘాన్ని కూడా నియమించక తప్పదు. ఏమైనా వచ్చే అగస్టు 15 స్వాతంత్ర్యదినానికి (రైల్వే తెలుగులో) స్వదేశీ జనానికి నీరా, ఉన్నత స్థాయిలోని పెద్ద మనుష్యులకు సారా, లభించే ఏర్పాట్లు జరిగితే, శాసనసభ వారు లోగడ చేసిన తీర్మానాన్ని ఆంధ్రప్రభుత్వం మన్నించినట్లే.

* * *

విద్యారంగంలో అసలు మూలవిరాట్టు భారతప్రభుత్వమే, విశ్వవిద్యాలయ విచారణ సంఘాన్ని, సెకండరీ విద్యావిచారణసంఘాన్ని, ఇవి గాక అకాడమీలను కేరపరం పరగా నియమించేసింది. రాష్ట్రప్రభుత్వానికి మిగిలింది ప్రాథమిక విద్య. దాని సంస్కరణానికి ఆంధ్రప్రభుత్వం మైసూరు ప్రొఫెసరు కుప్పుస్వామి అధ్యక్షత క్రింద కమిటీని నియమించి వారి నివేదిక నందుకుంది. ఆ నివేదికలోని సూచనలను విచారించడానికి బహుశా ఇంకొక కేబినెట్ ఉపసంఘాన్ని నియమించే సావకాశాలున్నాయి. అంతవరకూ పాతవిధానం నడుస్తునే ఉంటుంది.

* * *

ఆంధ్రప్రభుత్వం ఏర్పాటుచేసిన కమిటీలలో చిత్రమైన కమిటీ మరొకటుంది. అది గోదావరి వరదకమిటీ. దాని విధులేమిటో స్పష్టంగా చెప్పబడలేదు కాని, గత సంవత్సరం గోదావరి వరదలవల్ల కలిగిన అపూర్వ ప్రమాదాలకు కారణాలనూ బాధ్యతలనూ విచారించి, ఇకముందు అలాంటి ప్రమాదాలు రాకుండా తగు కట్టుదిట్టాలను సూచించడానికని వినికిడి. సాధారణంగా-విమాన ప్రమాదమో, రైలు ప్రమాదమో, జరిగితే వెంటనే గంటలలో అందుకు సంబంధించిన అధికారులు విచారణజరిపి, ప్రమాదకారణాలను తెలుసుకుంటారు. ఎవరి అజాగ్రత్తవల్లనైనా అలాంటిది జరిగితే వారిని శిక్షిస్తారు. ఉమ్మడి మదరాసు ప్రభుత్వంలో కృష్ణవేణమ్మ ఆగ్రహించి వేసా కృష్ణమూర్తివంటి ఘనుడైన ఇంజనీరునూ ఆయన సహచరులనూ పొట్టపెట్టుకున్నా, దొంగపడిన ఆరు నెలలకు కుక్క మొరిగినట్లు, చాలా కాలానికి విచారణ సంఘాన్ని నియమించారు. నేటి మన చీఫ్ ఇంజనీరు వెంకటకృష్ణయ్యగారిగారే దానికి అధ్యక్షత్వం వహించారు. ఆ విచారణ ఫలితంగా ఎవరిమీదనూ నేరారోపణం జరుగకపోయినా చీఫ్‌ఇంజనీరువెంకటాచారిగారు తమఉద్యోగానికి తిలోదకాలిచ్చేరు. (మనం విడిపోయినాక మళ్లీ చేరిపించుకొంది అది వేరేమాట)

గోదావరి వరద లొచ్చాక వెంటనే అలాంటి విచారణ జరిపించాలని కోరితే అప్పట్లో ఎవరూ బాధ్యులైనవారు విని పించుకోలేదు. కాని మళ్ళీ వరద వచ్చే కాలానికి ఆంధ్రప్రభుత్వం విచారణ సంఘాన్ని వేశారు. అవిచారణసంఘానికి అధ్యక్షుడు మళ్ళీ శ్రీ వెంకటకృష్ణయ్యగారే. స్థానికాధికారులఅలక్ష్యంవల్ల వరదనష్టం కలిగిందని తేలేయెడల నైతికంగా బాధ్యత వహించవలసిన అధికారి ఆయనే. మరొక ఇంజనీరు సభ్యుడు శ్రీ ఇవటూరి నాగభూషణరావు: వరదనాటికే స్థానిక ఉద్యోగస్థుల తప్పిపోయి బాలకాగా వుండి కుండా లిస్తూ వచ్చిన ఇంజనీరు, కంట్రాక్టరు. మిగతా అనుద్యోగ సభ్యులలో రాజమహేంద్రవరం మున్సిపల్ ఛెయిర్మన్ శ్రీ నాగేశ్వరరావుగారొకరు. స్థానికాధికారుల అశ్రద్ధవల్లనే వరద ప్రమాదం కలిగిందని నొక్కి వక్కాణించినవాడు. ఇక మిగిలిన సభ్యుడు పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంటు శ్రీ అల్లూరి బాపినీడు. దున్నపోతు ఈనిందంటే దూడనుకట్టెయ్ మన్నట్లు మూతుమ్మిడిగా మాడకుండు గట్లు సెట్టుచెయ్యమని పి. డబ్ల్యు. డి. కోట్లు తగులబెడుతుంటే గోలపెట్టినందుకు ఆయన ఈ కమిటీలో పడ్డట్టుంది. ఈ నలుగురూ కలసిన కమిటీవారు ఏమి విచారణ చేస్తారో ఈశ్వరుడి కెరుక.

క్రిందటి అగస్టునెలలో నే, దైవికంగా వచ్చిన వరదలకు అధికారులేమిచేస్తారని వెంకటకృష్ణయ్యగారు మాట వదలినట్లు జ్ఞాపకం. దానికి వ్యతిరేకంగా శ్రీనాగేశ్వరరావు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. మిగతా ఇద్దరు ఒకరటూ ఒకరిటూ వుంటే సున్నకు సున్నా హళ్లికి హళ్లి. సెనకటికొరదాలలోకి వెళ్ళక్కరలేదు. అప్పటి స్థానిక అధికారి పిళ్లెగారు రాష్ట్రాన్ని వదలిపెట్టి వెళ్లిపోయాడు. ఇకపోనీ విచారణోపాయాలను మాత్రం ఈకమిటీ వారు విచారిస్తారా అంటే ఈసారి వరదలు కూడా పోనియ్యం డన్నట్లున్నది వారి పరిస్థితి. ఇంతకూ గోదావరమ్మ నిరగబడకుండా అమెను అదుపులో పెట్టగలిగిన ప్రముఖులచేత భవిష్యత్తును గురించి విచారణ జరిపించడం పదబనిపించుకుంటుంది. ఏ విశ్వేశ్వరయ్యగారితో, లేక తిరుమలయ్యంగారివంటి వారితో వీరాజ్ అధ్వర్యం వహించి విచారణ జరిపించమని కోరి యుండవలసింది. పరిపాలనానుభవంగల నిపుణులను సభ్యులుగా వారికి సహాయపడమనడం సబబు. అంతే కాని మాటవరుసకి, కళ్ళనీళ్ళు తుడిచే కమిటీలను నియమించడంవల్ల ప్రభుత్వానికి ప్రజలంటే ఎంత అలక్ష్యమో అనిపించకమానదు.

* * *

ఆంధ్ర ప్రభుత్వం ఈమధ్య నే దేవాదాయ ధర్మాదాయ చట్ట సంస్కరణానికొక కమిటీని వేసింది. హరిజన సేవకొక సంఘాన్ని నియమించింది. శిస్తు సంస్కరణకు, పార్టుపోండ్ సంస్కరణకు. ఇంకా ఎన్నిటికో విచారణసంఘాలనువేసింది. ఆయుర్వేదాభివృద్ధికి లక్ష్మీపతి కమిటీ, ఉపాధి విస్తరణానికింకొక కమిటీ పనిచేస్తూనే ఉన్నాయి. ఎవరైనా ప్రభుత్వాన్ని కోరడం తడవు; ఒక కమిటీ ఏర్పడి తీరుతుంది.

అన్నిటికన్న హఠాత్తుగా ఏర్పడిన కమిటీ లక్కరాజు సుబ్బారావు గారి అధ్యక్షత క్రింద నియమింపబడిన భూసంస్కరణ కమిటీ. నేటి కిరాయి సాటకాల్లో మొదటి కృష్ణుడు, రెండో కృష్ణుడు, మూడో కృష్ణుడు రంగంమీద ప్రత్యక్షమౌతున్నారు. అల్లాగే భూసంస్కరణకు ఈ రాష్ట్రానికి సంబంధించినంతవరకు ఇది నాల్గవ విచారణ అనాలి. 1946 సం॥లో శ్రీ రాఘవేంద్రరావు అనే కలెక్టరు భూమి తరాలను గురించిన పమగ్రమయిన విచారణ జరిపించారు. అటుపిమ్మట కాంగ్రెస్‌కమిటీ తరఫున కుమారప్ప గారి సంఘ మొకటి విచారణ జరిపి సూత్రప్రాయంగా నివేదికను సమర్పించారు. ఆ పిమ్మట శ్రీ యం. వి. సుబ్రహ్మణ్యం ఐ.సి.యస్. గారి అధ్యక్షతను ప్రముఖులతో కూడిన ఒక విచారణ సంఘం మద్రాసు రాష్ట్రమంతా తిరిగి అన్ని ప్రాంతాలకు అనువైన ఒక సమగ్రనివేదికను తయారుచేసింది. ఇక కొత్తగా నియమింపబడ్డ కమిటీ సేకరించే సమాచారం ఏమిటాయని సామాన్యు లందరికీ సంశయం కలుగకమానదు. సంస్కరణలు అమలు చేయదలచుకుంటే ప్రభుత్వానికి సంజాయిషీ లోపం లేదు. మరెందుకయ్యా ఈ తంతంటే 'కాలహరణమే' శ్రీరామచంద్రా! కాకపోతే భూమిని గూర్చిన సమస్యలపైని చక్కగా పరిశోధనలుచేసి అంతర్జాతీయానుభవాన్ని గడించిన కాకీ పండితుడు శ్రీ కాయన్న లభ్యమైనాడు. ఆయనకు పని చెప్పడానికి ఇంతకన్న అవకాశమేమీ మరొకటి కనుబడదు. పసనకాయ దొరికినప్పుడే పిల్లి కొర్యం కానిమ్మన్నాడు శాస్త్రకారుడు.

భూసంస్కరణ లసంగతి చురుకుగా ఆలోచించమని అజ్మీర్‌లో ఎ. ఐ. సి. సి. తీర్మానం ప్రకారం ఎవరైనా తొందర చేయదలచుకుంటే ఆంధ్ర ప్రభుత్వం జోలికిమాత్రం రావడానికి వీలులేదు. కావలిస్తే చూసుకోండి కమిటీ ఏర్పడింది!

* * *

ఆకోయ్యే శాసనసభా సమావేశంలోగా ఆంధ్రప్రభుత్వం ఇంకా చాలా విచారణ సంఘాలను నియమింపబోతున్నదని తెలుసుకో గలిగినవాళ్లు తెలుపుతున్నారు.

1. వ్యవసాయకూలీ విచారణ సంఘం: దీనికి అధ్యక్షత వహించవలసినది. శ్రీకూర్మయ్యా, లేక శ్రీజయ్యా సూర్యనారాయణమూర్తియా అనే విషయం పరిష్కారంగాక ఇంకా బయటపడలేదు. సభ్యులు సిద్ధంగానే ఉన్నారు. యీ ఇద్దరుకాక వేసే అధ్యుడని చెప్పగలిగినవారెవ్వరైనా హరిజనులలో బయులు దేరితే ప్రభుత్వం వారివిషయం సుముఖంగానే ఆలోచించవచ్చును.

2. ఆంధ్ర నాటకరంగ విచారణ సంఘం త్వరలోనే ఏర్పడవచ్చును. యీ కమిటీకి అధ్యక్షత వహించవలసిన శ్రీ గోపాలరెడ్డిగారు ప్రస్తుతం సాహిత్యరంగంలో ప్రత్యేక కృషిచేస్తున్న కారణంచేత ఆ గౌరవం శాసనసభ ఉపాధ్యక్షులైన పసల సూర్యచంద్రరావుగారికే లభించవచ్చునని విద్యా మంత్రిగారికి సన్నిహితులైనవారు వారి మిత్రులతో చెపుతుండగా విన్నవారు దూర్తిగా చెప్పేరు.

3. పంచవర్ష ప్రణాళిక విచారణ సంఘం: యీ సంఘానికి అధ్యక్షులు సరియైనవారు దొరుకుట లేనందున బహుశా మన ఆర్థిక సలహాదారుడూ, అభివృద్ధిక మిషనరు అయిన శ్రీ నటరాజన్ గారే అధ్వర్యం వహించవచ్చును. అయితే వారు ఇందుకు ప్రత్యేక వేతనాన్ని ఏమీ కోరకున్నందుకు ఆంధ్రులు బహుశా కృతజ్ఞులు. సభ్యులుగా నుండగోరేవారు శ్రీ నటరాజన్ గారికే దరఖాస్తు చేసుకో వచ్చును.

4. సర్వోదయ విచారణ సంఘం:- ఆంధ్రదేశంలోని సర్వోదయ కేసుల ప్రతిభను సరియైన మానాల్లో కొలచి సర్వోదయ రాజ్యస్థాపనకు పునాదులు వేయుటనుగురించి విచారించుటకు యీకమిటీ ఏర్పాటు కాబోతోంది. శ్రీ సీతారామస్వామిజీ వారు నిరాకరించినందున అధ్యక్షులుగా శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారే నియమింపబడగలరు. వీరిచ్చే దినభత్యాలు రూపాయలలో స్వీకరించనను శ్రీ వెంకటకృష్ణయ్యగారి కోరికను ప్రభుత్వం మన్నించి రోజు 1కి సేరు బియ్యం చిల్లరఖర్చుక్రింద 4 చిల్లర నాలునూ మంజూరుచేసింది. ఈసంఘానికి ముప్పాతికమూడువీసాలు శ్రీ తంగిరాల రాఘవరావుగారు కార్యదర్శులుగా మామూలు జీతభత్యాలమీదనే నియమింపబడతారు. అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ప్రాయోపవేశ కాలములో దగ్గరున్న వారందరూ ఇందులో సభ్యులు.

* * *

ఈవిచారణ సంఘాలేకాక ఆంధ్ర మహాజనుల కోరికలపైని అవుసరమైన విచారణసంఘాలను నియమించడానికి ఆంధ్రప్రభుత్వం తయార్. తగుమైన మనుష్యులు ముందుకురావాలి!.

గ్రా. లి.

## "భారతవాణి"

### ఉత్తమ డాక్యుమెంటరీ చిత్రం సమీక్ష

మద్రాసు, అగస్టు 2: మహాత్మా గాంధీ జీవితంలో అతిప్రధానంగా పరిగణించబడే రెండుసంవత్సరాలను తీసుకుని, లోకోత్తరమైన గాంధీజీ వ్యక్తిత్వాన్ని, భారత స్వాతంత్ర్య సమర ఘట్టాల్ని కళ్ళకుకట్టినట్లుగా చూపించే డాక్యుమెంటరీచిత్రం "భారతవాణి" నిన్న ఉదయం వెల్లింగ్టన్ టాకీసులో ప్రత్యేకంగా ప్రదర్శింపబడింది. ప్రదర్శనకు అసంఖ్యాకంగా ప్రేక్షకులు హాజరైనారు. మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశకూడా హాజరయ్యారు.

1929 డిసెంబరునుండి, 1932 జనవరివరకూ దేశంలో జరిగిన ప్రధాన రాజకీయ సంఘటనలను, వాటిలో గాంధీజీ వహించినపాత్రను ఈచిత్రం సమీక్షిస్తుంది. అరోజుల్లో వివిధవార్తాచిత్రాల సంస్థలు తీసిన న్యూస్ రీళ్ల సహాయంతోను, ఫొటోల సహాయంతోనూ ఈ చిత్రం నిర్మించబడింది. ఇందులోని దృశ్యాలు 23, 24 ఏండ్ల క్రిందట తీయబడినవి కావడం చేత కొంచెం మసిపోయిఉన్నప్పటికీ, ఎడిటింగ్ అత్యుత్తమస్థాయిలో ఉండడంచేత యీచిత్రం గొప్ప డాక్యుమెంటరీల శ్రేణిలోకి చేరుతున్నది.

లాహోరు కాంగ్రెసులో తీర్మానించబడి, దేశమంతటా ప్రతిధ్వనించిన "పూర్ణస్వరాజ్య" నినాదం, దండియాత్ర, ఉప్పుసత్యాగ్రహం, వేలకొలది సత్యాగ్రహులను బ్రిటిష్‌ప్రభుత్వము లాఠీఛార్జి చేయించడం, గాంధీ ఇర్విన్ ఒడంబడిక, "ఈఅర్ధ దిగంబర సన్యాసిని వైస్రాయిభవనంలోకి ఆహ్వానించడం ఘోరం" అని చర్చిల్ వెళ్ళగక్కిన దురహంకారం, అర్ధ దిగంబర సన్యాసినే బ్రిటిష్ ప్రభుత్వం రౌండ్ టేబిల్ సమావేశానికి పిలిపించడం, బకింగుహాంభవనంలోకి గాంధీజీ తన మామూలు దుస్తులతోనే అతిథిగా వెళ్ళడం, యీచరిత్ర యావత్తూ ఒక గంటలో మన కళ్లఎదుట చకచక జరిగిపోతుంది. లండనుకు ప్రయాణమైవెడుతున్న గాంధీజీ "రాజపుటానా" నౌకలో వివిధంగా రోజులు గడిపిందీ, త్రోవలో అనేకదేశాల నాయకులు ఆయనను ఎంత గౌరవించిందీ, లండనులో మూలవ్యా, సరోజినీనాయుడు మున్నగువారు పక్కులండనులో ... చేయగా, గాంధీజీ తూర్పులండనులో కార్మిక నివాసాలమధ్య ఎలా నివసించిందీ, స్విట్జర్లండులో జనీవాలో ఫ్రెంచి రచయిత రోమారోలా సెలాకలుసుకున్నదీ, ఇటలీలోని ఫాసిస్టు ప్రభుత్వంకూడా ఆయన కెంత గౌరవ మర్యాదలు చూపిందీ, చూసి ప్రేక్షకులు తన్మయులవుతారు.

ఈచిత్రానికి మీరాబెన్, జేవదాస్ గాంధీ, ప్యారీలాల్ గార్లు ఇచ్చిన ఇంగ్లీషు కామెంటరీ, చిత్రంపొడుగునా అంతర్వాణిలా వినిపించే నేపథ్య సంగీతం అత్యంత ప్రశంసాపాత్రంగా ఉన్నాయి.

## భావే భూదానోద్యమ ప్రభావం

### శ్రీస్వామి రామానంద తీర్థ ప్రశంస

ఇబ్రహీంపట్టణం, జూలై 29: "భూమి కష్టపడి కృషిచేసే రైతుకే స్వంతమవ్వాలి. అజాదే దేశంలో బీద తనాన్ని రూపుమాప వీలవుతుంది. ఇందుకే, వినోబభావే భూదాన ఉద్యమం ప్రారంభించారు. భూస్వాములకు నచ్చచెప్పి వారి భూములలో కొంత భాగాన్ని బీదవారికి ఇమ్మని చెప్పుచున్నారు. దానంచేయు భూస్వామి నేను దానంచేస్తున్నానని తలచరాదు. కష్టించే పండించే వానికి హక్కును ఇస్తున్నానని భావించాలి. భూదాన ఉద్యమం ప్రవాహంవంటిది. ఎవరూ దీనిని అడ్డుకోలేరు. తెలంగాణా ప్రజలసమస్యలను తీర్చుటకు కత్తులు, తుపాకులు అవసరంలేదు. అహింసా యుతంగా, వినోబభావే ఉద్యమంద్వారా సమానత్వం సాధించవచ్చు. ఈరోజున 8 వందల ఎకరాలు పంపిణీ జరుగుతోంది. మీరు సంఘకక్షతో భాగుపడాలని కోరుదున్నాను" అని ఇబ్రహీంపట్టణం తాలూకా లంబాడీ మహాసభను ప్రారంభిస్తూ శ్రీ స్వామిరామానందతీర్థ ఉద్ఘాటించారు.

"ఏరీతిగా సృష్టిలో నిగాలి, నీళ్లు అనుభవించుటకు సమానహక్కు కలదో, అదే విధంగా ఆహారం పండించే భూమిలో, పండే ధాన్యం అనుభవించటంలో సమానహక్కు లభించాలి. భగవంతుడు ప్రపంచాన్ని, మానవులనూ బ్రతకటానికి సృష్టించాడు. బ్రతకటానికి తిండి కావాలి. అందుకు, కష్టించి పండించే వారికే భూమిపై సమానహక్కు లభించాలి. ఈ నూతనాశయం, సాధనకే వినోబభావే నూతన విధానాన్ని ప్రవేశపెట్టారు. శాంతియుతంగా సమానత్వాన్ని సాధించాలి. భూదానోద్యమంఆదర్శప్రాయమైంది" అని కూడా స్వామీజీ అన్నారు.

ఇబ్రహీంపట్టణం తాలూకాలో బోడకొండ తండాలో భూమి పంపిణీని జూలై 28వ తేదీన రామానందతీర్థ గారు జరిపారు. అప్పుడే తాలూకా లంబాడీ మహాసభకు ప్రారంభోత్సవం చేశారు. శ్రీ ఉమ్మెత్తల కేశవరావుగారు కూడా హాజరైనారు. వేలాదిమంది లంబాడీలు స్వామీజీకి స్వాగతం యిచ్చారు.

తాలూకా కాంగ్రెసు కార్యదర్శి అరుట్ల రామచంద్రారెడ్డిగారు లంబాడీల తరఫున స్వాగతమిచ్చారు.

శ్రీ శ్రీనివాసరావుగారు తాలూకాలోని లంబాడీలు తమఅభివృద్ధికి సంఘాలుగా ఏర్పడాలని విజ్ఞప్తిచేశారు.

రాష్ట్ర భూదానసమితి కన్వీనర్ ఉమ్మెత్తల కేశవరావుగారుమాట్లాడుతూ భూమి దున్నేవాడికి లంభించాలనే, విధానం దేశం మొత్తంగా అమలుకురాగలదనీ, మీరంతా సంఘకక్షిద్వారా పురోగమించాలనీ తెలియజేశారు.

ఆర్. లక్ష్మీనరసింహారెడ్డిగారు రాకటానికి నీరు, విద్యకు పాఠశాలు, వైద్యసౌకర్యం కంపేరాయని తెరువు మరమ్మతు వెంటనే జరగాలనికోరారు.

శ్రీ బాగాయత్ రామారావుగారు భూములను ఇచ్చిన కుటుంబాల పేర్లను చదివారు.

## ఆచార్య వినోబాభావే ఒరిస్సా పర్యటన

కటక్, అగస్టు 1: వచ్చే సంవత్సరం జనవరి ఆఖరువారంలో ఒరిస్సాలో తాము పర్యటించగలమని ముజఫర్‌పూరులో జరిగిన జీవనదాన్ మహాసభకు వెళ్లిన ఒరిస్సా ప్రతినిధులకు ఆచార్య భావే తెలియజేశారు.

. మార్చినెల మధ్యలో పూరీలో అఖిలభారత సర్వోదయ సమ్మేళనం జరుగగలదు. సుమారు 8 మాసాలు ఒరిస్సాలో శ్రీ భావే వుండగలరని భూదాన కమిటీవారు భావిస్తున్నారు.

## పొగాకు ఉత్పత్తిదారుల భయాలు

### వ్యవసాయశాఖ మంత్రికి వివరణ

కర్నూలు, అగస్టు 1: ఈ యేడు పొగాకు పండించుదామా వద్దా అని కంభం తాలూకా పొగాకు ఉత్పత్తిదారులు అనుమానిస్తున్నారు. గిద్దలూరులోని ఐ. ఎల్. టి. పొగాకు డిపోను ఈయేడు మూసివేశారు. కనుక ఇకముందు తాము పండించే పొగాకు అమ్మకం కాదేమోనని రైతులు అనుమానిస్తున్నారు.

కంభం తాలూకా పొగాకు ఉత్పత్తిదారుల తరఫున శ్రీ పిడతల రంగారెడ్డి, డి. పాండురంగారెడ్డి, డి. వేమారెడ్డి, వి. వి. సుబ్బారావుగారులు వ్యవసాయ శాఖమంత్రి తిమ్మారెడ్డిగారిని కలుసుకొని ఈయేడుకూడా రైతులు పొగాకు పండించడానికి వీలుగా, పండించే పొగాకు అమ్మక మవుతుందన్న నమ్మకం వారికి కలగడానికిగాను పొగాకు అమ్మకానికి తగిన ఏర్పాట్లు చేయించమని అభ్యర్థించారు. పొగాకు అమ్మకానికి తగినఏర్పాట్లు చేయిస్తానని తిమ్మారెడ్డిగారు వారికి వాగ్దానం చేసినట్లు తెలిసింది.

## సంపాదకునకు లేఖలు

### ఎస్. ఎస్. ఎల్. సి. సప్లిమెంటరీ జాబితా

అర్యా, రాయలసీమవారికి ఆంధ్ర యూనివర్సిటీ మోడరేషన్ నిబంధనలు మద్రాసు యూనివర్సిటీ నిబంధనలు రెండును వర్తింపచేశారు. దీనికి కారణం శ్రీ తిరుపతి విశ్వవిద్యాలయ ప్రాసంభిమే. చాలా సంతోషము. ఒకే రాష్ట్రంలో విద్యార్థులకు కొంతమందికి రెండు రకాల నిబంధనలు వర్తింపచేయబడినవి. మరికొంతమందికి ఒకే నిబంధనలు వర్తింపబడినవి. ఇది న్యాయసమ్మతము కాదని తోస్తున్నది. సర్కారు విద్యార్థులకు గూడా మదరాసు నిబంధనలు వర్తింపజేసి ఆ కొద్దిమందికి కూడా న్యాయం చెయ్యాలి. మద్రాసు నిబంధనలు ఆంధ్రకంటె ఉన్నత ప్రమాణంలో ఉన్నందువలన విద్యాప్రమాణం తగ్గదు. దీనివలన ఏ కొద్దిమందికో లాభించవచ్చునని, అందువలన మదరాసు నిబంధనలు సర్కారు వారికి వర్తింపజేసి ఫలితాలు చేయుతే దన్నారు. ఇది బహు అన్యాయము. ఆకొద్దిమందికైనా, న్యాయం చెయ్యాలి. మంత్రిగారు వెంటనే ఆలోచించి మద్రాసు మోడరేషన్ ప్రకారం సర్కారు జిల్లాలలో ప్యాసయే వారి జాబితా గూడా వేయించాలి.

విద్యార్థి సంఘాలు, ఉపాధ్యాయులుగూడా ఈ విషయంలో శ్రద్ధ తీసుకోవలెనని నా ప్రార్థన.

న్యూఢిల్లీ: ఘంటి రాధాకృష్ణమూర్తి.

* * *

### కళాభివృద్ధికి ఒక సంస్థ చాలదా?

అర్యా, జూలై 17వ తేదీ పత్రికలో నేను వెల్లడించిన అభిప్రాయాలకు శ్రీ వేదుల జగన్నాథరావుగారు సమాధాన మిచ్చారు. వారికి నా కృతజ్ఞత. ఆంధ్ర థియేటర్సు ఫెడరేషను కార్యదర్శి శ్రీ రామారావుగారు తాము, పరిషత్తు కార్యవర్గ సభ్యుడుగా ఈ విషయం వివరించినట్లూ, బందరు సభలలో "పరిషత్తుకు యీ బాధ్యత లేకుంటే కక్తి, అవకాశం లేనట్లు చెలిపారు. యీ విషయాలను వెల్లడించ వలసిందిగా పరిషత్తు కార్యదర్శిని కోరుతున్నాను.

నాటక కళాభివృద్ధికి, కర్షతో ముఖ్య కృషిచేయులేక, కేవలం "నాటికోత్సవములు" జరపడానికి పరిషత్తు స్థాపించబడలేదు. వారి కోర్కె నాలమాత్రమే అయిన, ఫెడరేషను పరిషత్తులో విలీన మవవచ్చుగదా? పరిషత్తు కార్యదర్శి యీ వివరాలు వెల్లడించాలని కోరుతున్నాను.

పోతే, శ్రీ వేదుల జగన్నాథరావుగారు, ఫెడరేషను "పరిషత్తుకు" పోటీ కాదని భావించినందుకు సంతోషము. కాని వారిప్రకటనసుబట్టి, నాఅనుమానములు యథార్థములని విశ్వసించవలసి వస్తున్నది. "అనేకరూపాలలో" ఆరాధించడం, ప్రజలకు సంబంధించిన విషయములలో, "వేరు, వేరు పాయ్యిలకు దారితీయగలదు," కళాపరిషత్తు "కొందరికి" ప్రాతినిధ్యం వహిస్తున్నప్పుడు, ఫెడరేషను "అమిగతా" కొందరికి ప్రాతినిధ్యం వహించే ప్రమాదమున్నది.

రెండవ విషయము, "పరిషత్తువారు" వార్షికసభలూ, "ఫెడరేషనువారు" మిగతా కార్యక్రమం నిర్వహించిన, తీర్థానికి తీర్థము-ప్రసాదానికి ప్రసాదమును కాగలదు. పరిషత్తు ఇట్టి కార్యక్రమాన్ని నిర్వహించ"జాలదని" రావుగారు వెల్లడిచేశారు. నిర్వహింపచేయడం కళాభ్యాదుల చేతులో వున్నది. కళాభివృద్ధికి ఒక సంస్థద్వారా కృషి చేయవచ్చు.

ఇట్లు
యాతాముల భీమశంకరం.

* * *

### కృష్ణా తూర్పుగట్టు కాలువకు అధికంగా నీరు

అర్యా, కృష్ణా సెంట్రల్ డివిజను లోని కృష్ణా ఈస్టు బ్యాంకు కాలువకు ప్రస్తుతం సప్లయి చేయబడుతున్న నీరు సరిపోవుటలేదు. దివిసీమలో యింకా సాగుకావలసిన భూములకు నీరు సప్లయి లేదు. ప్రధాన ప్రాంతంలో ప్రతీ కాలువా చివరి భాగములలో నీరు సప్లయిగాక పంటలు నష్టమగుచున్నవి. నాగాయిలంకవరకైరా గ్రామాల రైతులు తమభూములను సాగుచేయ కుమాపాలకైనట్టు తెలియుచున్నది. ఘంటసాల వరకైరా అధికావారోత్పత్తి స్కీములకు అగస్టునుంచిగాని నీరు ఇచ్చుటకు వీలు పడకున్నది. ఈ నీటికొరతవలన చాలా విలువైన భూములు పంట తప్పక పండుచూ గిట్టుబాటు కావటంలేదు.

ఈ నీటికొరతను తీర్చవలెనంటే ఎవ ములకుదురువద్ద కృష్ణా తూర్పుగట్టు కాలువకు యిదివరకున్న తూములు విస్తీర్ణము పెంచవలెను. లేదా మరిరెండు తూములైనా పెంచి హెచ్చునీరు సప్లయి అగుటకు అవకాశము కల్పించుచూ కాలువ ఒక మైలువరకు వెడల్పు చేయవలసియుండును. కొద్ది ఖర్చుతోనే కొన్ని వేల ఎకరములకు నీటిసౌకర్యం ఏర్పడి అధికంగా పంట పండించుటకు అవకాశమున్నది. యీ సూచన పి. డబ్ల్యు. డి. శాఖవారు ఈ సంవత్సరమే అమలు జరిపి నీటికొరత తీర్చగలరని విశ్వసించుచున్నాను.

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య,
అధ్యక్షులు,
(ఆంధ్రరాష్ట్ర కిసాన్ సమ్మేళనం).

# రాష్ట్ర వార్తలు

## కడపకొల్లం

గ్రామ పంచాయతీకి జరిగిన పునః ఎన్నికలలో శ్రీ వాదర్ల వెంకటసుబ్బారావుగారు (కె. యల్. పి.) ఎన్నికైనారు.

## రాయదుర్గం

మాజీ సైనికుల సమావేశం శ్రీ సంజీవరాయుడుగారి అధ్యక్షతన జరుపబడెను. శ్రీ యస్. ఆర్. రావుగారు మాజీ సైనికుల యిబ్బందులు వివరించారు.

## వెంకటగిరి

శ్రీ జి. వెంకటేశ్వర భాగవతారు గారు వెంకటగిరి రాజాగారి హాలులో సంపూర్ణ మహాభారతము హరికథా కాలక్షేపం జూలై 26 నుంచి గావించుచున్నారు.

## నర్సరావుపేట

ప్రపంచ ఆరోగ్యవారం ప్రభుత్వ ఆస్పత్రి ఆవరణలో శ్రీమతి నికిల్ గారి అధ్యక్షతన జరుపబడెను. శ్రీ డా. రంగాచార్యులు ప్రసంగించారు.

## చీరాల

గవర్నమెంటు ఆసుపత్రి లేడీ డాక్టరు శ్రీమతి యం. ఆర్. జి. పరమానందంగారు తెనాలికి బదిలీ కాబడిన సందర్భములో, ఆసుపత్రి సిబ్బంది అల్పాహారవిందు గావించారు.

## కల్లేపల్లిరేగ

బోర్డు ఉన్నత పాఠశాలలో జిల్లా బోర్డువారి ఉత్తర్వుప్రకారం ఈ పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీ పట్టిసపు నరసింహమూర్తిగారిచే V ఫారం నూతనముగా తెరువబడినది.

## గుంటూరు

యం. యల్. సి. యం. హైస్కూలు భవనమున ఆగస్టునెలలో జరుగు హిందీ పరీక్షల కేంద్రం స్థాపించబడినట్లు హైదరాబాదు హిందీ ప్రచారసభ వారు సదరు స్కూలు ప్రధానోపాధ్యాయులకు లిఖిత పూర్వక అంగీకారమును తెలియజేశారు. ఈ కేంద్ర అధ్యక్షులు శ్రీ ఎ. యస్. చలపతిరావు, వ్యవస్థాపకులు శ్రీ డి. వి. రత్నంగార్లు.

* * *

ఫ్రెండ్సు యూనియన్ సొసైటీ వారి యాజమాన్యమున గుంటూరు అగ్రహారములోని శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారి దేవాలయములో యిటీవల పండిత సమావేశములు జరిగెను. మొదటి రోజున మద్రాసు శ్రీ కాశీ కృష్ణాచార్యుల గారి అధ్యక్షతన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు సంస్కృత బోధ భాషావశ్యకతను గూర్చి ఉపన్యసించారు.
రెండవ దినమున శ్రీ మాధవరామశర్మగారి అధ్యక్షతన శ్రీ గోపాల కృష్ణమాచార్యులు గారు సంస్కృత భాషా ప్రశస్తిని గూర్చి ఉపన్యసించారు.
మూడవ దినమున శ్రీ నృసింహస్వామివారి అధ్యక్షతన పిల్లలమర్రి హనుమంతరావుగారు పోతన కవిత్వమును గూర్చి ఉపన్యసించారు.

## రేపల్లె

ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగియ సంఘ కార్యవర్గ సమావేశం జూలై 27న శ్రీ కొవరాజు వెంకటరత్నంగారి అధ్యక్షతన జరిగెను. ఆగస్టునెలలో వెంకటగిరిలో సర్వసభ్య సమావేశం జరపాలని తీర్మానించారు. కార్యదర్శి శ్రీ సత్యనారాయణరావుగారు నివేదిక చదివారు.

* * *

వైదిక విద్వాంసులు శ్రీ కాకాని వెంకటసుబ్బరాయశర్మగారు ఇచ్చట జూలై 26వ తేదిన శ్రీ చిట్టి సూర్యనారాయణమూర్తిగారి గృహమునందు వీణ పాటకచేరి జరిపారు. పురప్రముఖులు పెక్కుమంది పాటకచేరికి వచ్చి శ్రీ శర్మగారిని ప్రశంసించారు.

* * *

శ్రీ గోపాలస్వామివారి ఆలయంలో నమూరు నెలరోజులపాటు హరికథా కాలక్షేపం జరిపిన శ్రీ చింతలపాటి విశ్వనాథశాస్త్రి భాగవతారు గారికి జూలై 27న సన్మానం జరుపబడెను. శ్రీ గొల్లపూడి వెంకట హనుమంతరావు గారు అధ్యక్షత వహించారు. తిమ్మక శ్రీ రామమోహనరావు, బి. వి. సుబ్బారావుగార్లు ప్రసంగించారు. శ్రీ చిట్టి సూర్యనారాయణమూర్తిగారు వందన మర్పించారు.

## విజయవాడ

శ్రీ సత్యనారాయణస్వామి ఆలయ సంఘ సర్వసభ్య సమావేశము శ్రీ ముమ్మలపల్లి వెంకట నారాయణరావు పంతులుగారి అధ్యక్షతన జరిగినది. అందు, శ్రీ దిట్టకవి వీరరాఘవయ్య పంతులుగారిని అధ్యక్షునుగను, శ్రీ శ్రీరాం భీమశంకరరావు శ్రేష్ఠిగారిని ఉపాధ్యక్షుడుగను, శ్రీ చేబ్రోలు బాపనయ్య శ్రేష్ఠిగారిని కార్యదర్శిగను, శ్రీ మాజేటి వెంకటదుర్గయ్య శ్రేష్ఠిగారిని సహాయ కార్యదర్శిగను, శ్రీ నారుకుచ్చి సుబ్రహ్మణ్యముగారిని కోశాధిపతిగను ఎన్నుకున్నారు. అధ్యక్షుడు పాలకవర్గ సభ్యులను నియమించుటకు అధికారం ఇవ్వడమైనది. సభలో అధ్యక్షులు, తదితర సభ్యులు మాట్లాడారు.

## రాజమండ్రి

తాలూకా గీతపనివారల మహాసభ శ్రీ కందుల పెదసత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతన జూలై 27న ధవళేశ్వరంలో జరిగినది. శ్రీ కొసాని అప్పారావుగారిని తాటిబెల్లం వస్తువుత్పత్తి అభివృద్ధిస్కీము అమలు పరిశీలనసంఘ సభ్యునిగా నియమించినందుకు సభవారు కృతజ్ఞత ప్రకటించారు. సభలో శ్రీ కొసాని అప్పారావు, పెరుమాళ్ళ వెంకటసుబ్బారావు, కస్తూరి సుబ్బారావుగార్లు మాట్లాడారు.

## అనకాపల్లి

జూలై 27వ తేదీ సాయంకాలం అనకాపల్లి లింగమూర్తి హాలులో ఎస్. ఆర్. మాధవరావుగారి అధ్యక్షతన లింగమూర్తిపదవ స్మారకసభ జరిగింది. స్వర్గీయ లింగమూర్తిగారి గుణగణాలను ప్రశంసిస్తూ శ్రీ మాధవరావ్, జొన్నలగడ్డ సత్యనారాయణ, ముక్కా అక్కారావ్, ఎ. అన్నపూర్ణయ్య, ఉప్పల పెదవెంకట రమణయ్య ప్రభృతులు ప్రసంగించారు.

## కాకరపర్రు

శ్రీ వెంకట సత్యనారాయణ హరి జోన్నత పాఠశాలలో గ్రామ అభివృద్ధి సంఘం జూలై 26న స్థాపింపబడినది. శ్రీ వేదుల జగన్నాధంగారు అధ్యక్షత వహించారు. శ్రీ వేదుల రామజగన్నాధంగారు గ్రామ పునరుద్ధరణసంఘ ఆవశ్యకత, ఆశయములు వివరించారు. కాకరపర్తి సత్యనారాయణ గారు, యాళ్ళబండి గోపాలస్వామి గారు ప్రసంగించారు.

## గిద్దలూరు

కంభం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి శ్రీయుత యం. నరసింహులుగారు, ఉయ్యాలవాడ గ్రామ కాంగ్రెసు కమిటీ ఎన్నికలు జరిపారు. యీ గ్రామ కాంగ్రెసు కమిటీ, ఉయ్యాలవాడ, అంకాళమ్మపల్లి, సూరేపల్లి, ఆదిమూర్తిపల్లి, జమ్ములపల్లి, లింగాపురం, పింగంపల్లి గ్రామములకుగాను ఏర్పాటుగావింపబడినది. గ్రామకాంగ్రెసు కమిటీ నూతన అధ్యక్షులుగ శ్రీయుత లక్ష్మారెడ్డి వెంకటరెడ్డి, కార్యదర్శిగ శ్రీయుత వేములపాటి శెట్టి సహాయకార్యదర్శులుగ శ్రీయుతులు సంగన ఓబుల్‌రెడ్డి, పర్వతాల నారపురెడ్డిగారలు, మరో పదకొండు గురు కార్యనిర్వాహక సభ్యులుగ ఏకగ్రీవముగ ఎన్నుకొబడ్డారు.

అనంతరము గ్రామకాంగ్రెసు అధ్వర్యమున జరిగిన బహిరంగసభయందు యీ తాలూకా శాసనసభ్యులు శ్రీయుత పిడతల రంగారెడ్డిగారు ఉపన్యసించుచూ, కాంగ్రెసు సేవకులు, నిజాయితీతో, నిస్వార్థంగ ప్రజలలో పని చేయాలని ఉద్బోధించారు. కాంగ్రెసు కమిటీ కార్యవిధులనుగురించి శ్రీ ఎం. నరసింహులుగారు మాట్లాడారు.

## గుంతకల్లు

ప్రపంచ ఆరోగ్యవారం జూలై 24న మున్సిపల్ హైస్కూలులో జరుపబడెను. ఆరోగ్యవంతులైన పిల్లలకు మున్సిపల్ ప్రసూతికేంద్రంలో బహుమతులు ఇవ్వబడినవి. శ్రీ కె. రామనాధం వందనము లర్పించారు. సాయంత్రం శ్రీ కె. రాఘవేంద్రరావుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగెను. శ్రీ జి. కేశవయ్య, జి. ఆర్. లింగంగార్లు ఉపన్యసించారు.

## రాజంపేట

తాలూకా కాంగ్రెస్ సేవకుల సమావేశం ఆరెం అన్నయ్యగారి అధ్యక్షతన యిటీవల జరిగెను. శ్రీ చింతా వెంకటసుబ్బారెడ్డి, యం. కె. నాయుడు, ఆకుల మల్లయ్య శెట్టిగార్లు ప్రసంగించారు. రాయలసీమలో ఋణాల వసూళ్లు వచ్చే జనవరి వరకు వాయిదా వేయాలనీ, హైకోర్టు న్యాయమూర్తులలో రాయలసీమవారికి ప్రాతినిధ్య మివ్వాలనీ, నందలూరు - గుండ్లూరు మధ్య రోడ్డు నిర్మించాలనీ ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానించారు. శ్రీ ఆరెం అన్నయ్యగారు ప్రసంగించారు. శ్రీ కె. శ్రీనివాసరావు వందన మర్పించారు.

## వెంట్రప్రగడ

ఆంధ్రస్టేటు దేవాదాయబోర్డు కమీషనరు శ్రీ రెడ్డి హరి వెంకటరెడ్డిగారు డిప్యూటీ కమీషనరు శ్రీ సి. వి. యల్. వరప్రసాద రావుగారు, అసిస్టెంటు కమీషనరు శ్రీ కె. రామకృష్ణప్పగారు శ్రీ జలమేశ్వర స్వామివారి దేవస్థానంకు వచ్చారు. దేవస్థానం గ్రంథాలయమునకు కమీషనరు వెంకటరెడ్డి గారిచే ప్రారంభోత్సవము చేయబడినది. సదరు దేవస్థానంకు ప్రధమ ట్రస్టీగా 14 సంవత్సరములు చేసిన కోటగడ్డ నాగయ్యగారి ఫోటోను డిప్యూటీ కమీషనరు వరప్రసాదరావుగారు ఆవిష్కరించారు. అనంతరము దేవస్థానం ట్రస్టీగారయిన కోటగడ్డ గోపాల కృష్ణయ్యగారిచే వారి గృహమునందు విందు యివ్వబడినది. కోటగడ్డవారి బాలబాలికలచే భరతనాట్యము జరుపబడినది.



కమ్యూనిటీ ప్రాజెక్టు పెద్దాపురం కేంద్రంలో ఆరువారాల ప్రాథమికోపాధ్యాయ సాంఘిక విద్యాశిక్షణ మొదటి జట్టుకు జూలై 25న వీడ్కోలు ఇచ్చినప్పటి చిత్రం.

# అరుణానది సద్వినియోగం

చిత్తూరుజిల్లా రైతుసంఘ కార్యవర్గసభ్యుడు శ్రీ పి. నాగులు, పుత్తూరు తాలూకా రైతుసంఘ అధ్యక్షుడు శ్రీ కె. రామచంద్రా రెడ్డిగార్లు యిలా వ్రాస్తున్నారు:

పుత్తూరు తాలూకాలో పెద్ద చెరువు అయిన గుర్లూరుచెర్వు నుంచి అరుణ వాగు ప్రారంభమై నారాయణవనం, పాలమంగళం వగైరా తెలుగు ప్రదేశాలు దాటి చెంగల్పట్టుజిల్లా తిరువళ్లూరు తాలూకాలో ప్రవేశించి ప్రవహిస్తున్నది. పుత్తూరు తాలూకా నారాయణవనం గ్రామంనుంచి యీ వాగు నదిరూపం ధరిస్తుంది గనుక దీనిని అరుణానది అంటారు. దీన్నే తిరువళ్లూరు తాలూకాలో ఆరణియార్ అని పిలుస్తారు. ఈ అరుణానదికి కాళహస్తి తాలూకా కొండల్లోకల్ల ఎత్తయిన సదాశివకోన, మూలపల్లం కొండల్లోని వాగుల నీళ్లు పుత్తూరుతాలూకా అంజేరమ్మ కనుమనుంచి తిరుకువరకువున్న విశాల భూభాగంలో కురిసే వర్షపు నీరు చేరుతున్నది. నాగలాపురం కొండల్లో నుంచి పాలమంగళానికి దగ్గరలో అరణియార్ ప్రాజెక్టునిర్మాణానికి పైభాగాన (పశ్చిమాన) ఒక పెద్ద వాగు యీ అరుణానదికి చేరుతున్నది. పైన కనబరచిన కొండప్రదేశాలలో ఏమాత్రం వర్షించినా యీ నదికి విపరీతంగా నీటి ప్రవాహం వచ్చుటకద్దు. ప్రస్తుతం ఈ నీరంతా వృధాగా పోతున్నది.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర అవతరణకు ముందు యీ అరుణానదికి పుత్తూరు తాలూకాకు తూర్పుసరిహద్దులో అంటె తిరువళ్లూరు తాలూకా భూభాగంలో ఆరణియార్ అనే తమిళ పేరుతో ఒక ప్రాజెక్టును నిర్మించదలచి యిప్పటికే కొంత పని జరిగింది. పుత్తూరుతాలూకాలో యీనదికి యిరుప్రక్కలవేలాది యకరాల భూమి నీటి కొరతవల్ల సాగు కాకుండా వున్నప్పటికి పుత్తూరు తాలూకా యీ నీటి సద్వినియోగానికి ఆలోచన చేస్తున్నప్పటికి వినిపించుకోని మద్రాసుమంత్రులు యీ నీటిని తమిళ జిల్లాకు తరలించుకు పోవడానికి ప్లాన్‌లు వేశారు. ఆర్థికంగా వెనుకబడిన పుత్తూరుతాలూకా రైతులకు నష్టదాయకమైన యీ ప్లానును ఉమ్మడిరాష్ట్రములో ఆంధ్రమంత్రులు ఎదిరించక పూరుకున్నారు.

ఈ అరుణానదిని పుత్తూరుతాలూకా నారాయణవనం పశ్చిమభాగాన ఎరుకంబట్టు గ్రామాన్ని ఆనుకొని నదిలోకి చొచ్చుకొనివున్న వల్లరాళ్ల గుట్టనుంచి నదికి తూర్పుభాగాన నది ఒడ్డుకు 3 ఫర్లాంగులలో వున్న గద్దకొండ భాగమైన బొల్లిగుట్టమధ్య అడ్డుకట్ట వేయుట ద్వారా పెద్ద రిజర్వాయరుగా తయారయ్యే అవకాశాలు ఉన్నవి.

(1) ఈ రిజర్వాయరు నుంచి నదికి తూర్పుదిశగా గద్దపర్వతం వెంబడి 8 మైళ్ళదూరం పాలమంగళంగ్రామం వరకు ప్రవహింపచేయు పంటకాలువ వల్ల కీళగరం, తిరుపటం, నాగిలేరు, గోపరాజు కండ్రిగ, తుంబూరు, పాలమంగళం గ్రామాల వంజ, పుంజ, బంజరు మొత్తం 3000 ఎకరాల సాగు అవుతుంది. ఈ పంట కాలువ కుమార చెరువు, తుంబూరు చెరువు, పాలమంగళం చెరువులకు పుష్కలంగా నీరు అందిస్తుంది.

(2) రిజర్వాయరుకు పశ్చిమభాగాన ఎరుకంబట్టు, బత్తులవారి కండ్రిగ, వీరపరెడ్డిపాలెం వగైరా గ్రామాదుల మీదుగా ప్రవహింపజేయు మరొక పంట కాలువ నక్కల చెర్వు ఎరుకంబట్టు చెరువులను నింపుటేగాక విడిగా 1000 యకరములసాగుకు వుపకరించును. ఎరుకంబట్టు దగ్గర లోలెవల్‌లో వున్న నదికి 250 అడుగుల వెడల్పులోను 30 అడుగుల ఎత్తుకు తక్కువకాని దళమైన కట్ట వేయించవలసియున్నది. నది ఒడ్డు నుంచి గద్దకొండ బొల్లిగట్టు (1500 అడుగులు) వరకు నదినుంచి పైకిపుబికిన నీరుకు ఆపుటకు తగిన విధంగా కట్ట పోయించిన యిది పెద్ద రిజర్వాయరు అగును. ఈరిజర్వాయరులో నిల్వకాదు నీరు రెండుపంటలకు సమృద్ధిగా సరిపోవును. ఈ రిజర్వాయరు నిర్మాణానికి రూ 4 లక్షలకంటె ఎక్కువ ఖర్చుకాదని మా అభిప్రాయం. క్రిందవున్న ఆయకట్టుదార్లు న్యాయమైన నీటి తీరువను చెల్లించుటకు, నీటికాలువల నిర్మాణంలో సహకరించుటకు సిద్ధంగా వున్నారనిగూడ తెలియజేస్తున్నాం. ఎన్నో సంవత్సరాలనుంచి కరువువాతబడ్డ పై గ్రామాల రైతుల కరువు నివారణకు యీ రిజర్వాయరు తప్ప వేరు మార్గం లేదు. సంవత్సరంలో 3, 4 దఫాలు బాగా ప్రవహించే నది కాబట్టి యీ రిజర్వాయరు పై కొనిన సాగుకు చాల వుపకరిస్తుంది.

ప్రస్తుతం యింజనీరింగ్ అధికారుల పరిశీలనలో వున్న యీ రిజర్వాయరు దృష్టిలో వుంచుకొని, యింతకు పూర్వం పుత్తూరుతాలూకా రైతాంగానికి యీ నది నీటి విషయంలో జరిగిన అన్యాయాన్ని యిప్పుడైనా తొలగించ ప్రయత్నించమని విన్నవిస్తున్నాము. త్వరలో పై కనబరచిన రిజర్వాయరును ప్రారంభించుటకు ఆంధ్రప్రభుత్వం ప్రభుత్వ పద్ధతిలో తగిన సౌకర్యాన్ని కలిగించాలని అర్థిస్తున్నాము.

## కడప

బద్వేలులోని శ్రీ కన్యకాపరమేశ్వరీ బోర్డు హైస్కూలు సహాయార్థం కడప శ్రీరామవిలాస సభవారు, జిల్లా కలెక్టరు శ్రీ ఎ. కృష్ణస్వామిగారి సమక్షమున ఛత్రపతి శివాజీ నాటకం ప్రదర్శించారు. కడప మున్సిపల్ హైస్కూలు హెడ్మాస్టరు శ్రీ వై. ఎ. సుబ్బయ్యగారు, శివాజీపాత్ర, కడప అడ్వొకేట్ శ్రీ ఎస్. ఎన్. రామస్వామిగారు, రఘునాథునిపాత్ర, కడప మున్సిపల్ కమీషనర్ ఎస్. సీతారామయ్యగారు ఔరంగజేబుపాత్ర ప్రశంసనీయంగా నిర్వహించారు. శ్రీమతి నాగరత్నమ్మగారు కథానాయికగా నటించారు. హైస్కూలు అభివృద్ధికిగాను 1681/-లు వసూలు జిల్లా కలెక్టరు (జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరు) గారికి సమర్పించారు. అడ్వొకేట్ సి. నాగరాజారావుగారి వందనాలతో కార్యక్రమం ముగిసింది.

## కాకినాడ

అఖిలభారత హరిజనసేవక సంఘ గౌరవ కార్యదర్శి శ్రీ వియోగి హరి గారు యిచటకు జూలై 29న వచ్చి హరిజనవసతిగృహం చూశారు. మరునాడు హరిజనులతో వూరేగింపుగా వెళ్లి సత్యనారాయణస్వామి, వేణుగోపాలస్వామివార్ల ఆలయాల్లో ప్రవేశం కలిగించారు. పిదప ఖాదీ భాండారు, విద్యార్థినీసమాజం సందర్శించారు. పి. ఆర్. కళాశాల హిందీ సంఘం ప్రారంభోత్సవం చేశారు.

## బద్వేలు

బద్వేలు ప్రాథమిక ఎయిడెడ్ పాఠశాలను ప్రాథమికోన్నత పాఠశాలగా మార్చారు. జూలై 22వ తేదీన పాఠశాలలో 6వ తరగతికి ప్రారంభోత్సవం జరుపబడింది. సభకు సి. నాగరాజా రావుగారు అధ్యక్షత వహించారు.
పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ జి. నారాయణరావుగారు వందన సమర్పణతో సభ ముగిసింది.

## సత్తెనపల్లి

జూలై 25వ తేదీ సాయంకాలం వి. సుందరరావుగారి అధ్యక్షతన జరిగిన సత్తెనపల్లి తాలూకా ప్రజాసోషలిస్టు పార్టీ సర్వసభ్య సమావేశంలో నీటి తీరువ పన్నును తగ్గించవలసిందిగానూ, డాక్టరు రామమనోహర్ లోహియా ప్రభృతులను వదలిపెట్ట వలసిందిగానూ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. సత్తెనపల్లిలో ఒక మున్సిఫ్‌కోర్టును ఏర్పాటు చేయవలసిందిగా ఆంధ్ర ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేశారు.

# పంచాయతీ యూనియన్ నిర్వాహకసంఘం

కాకినాడ, జూలై 29: ఆంధ్ర పంచాయతీల యూనియన్ నిర్వాహక సంఘ ప్రథమ సమావేశం తిరుపతిలో 8-8-54 తేదీని శ్రీనరసింహదేవర సత్యనారాయణగారి అధ్యక్షతన జరుగును. శ్రీ పి. తిమ్మారెడ్డిగారు ప్రారంభోత్సవము జరిపెదరు. అభివృద్ధిశాఖ కమిషనరు శ్రీ నటరాజన్‌గారు పంచాయతీల ఆవశ్యకతనుగురించి ఉపన్యసించెదరు.

# రొంపేరు బంజర్ల పంపిణీ

## ఆక్రమణదారుల, పట్టాదారుల సూచనలు

చీరాల, జూలై 29: రొంపేరు బంజరుల పంపకమునకు జారీ చేయబడిన ఉత్తరువులలో రొంపేరు కాలువకు పడమరన కాలువ కాపుదలకు లోగడ కేటాయించిన 1½ ఫర్లాంగు హద్దును 2 ఫర్లాంగులవరకు పెంచుతూ, ఈహద్దు లోపలనున్న ఆక్రమణదారులకు పట్టా లివ్వకూడదని నిర్ణయించబడటంవల్ల కొన్ని వందలమంది ఆక్రమణదారులకు పట్టాదారులకు తీరని అపకారం జరుగుతుందని, మురుగుకాలువకాపుకు 1½ ఫర్లాంగుల మేరకుమాత్రమే వుంచి 1½, 2 ఫర్లాంగులమధ్య భూములకుగూడా రొంపేరు ఉత్తరువులప్రకారం పట్టా లివ్వవలసిందని నిన్న ఇచ్చట రహదారి బంగళా ఆవరణలో జరిగిన రొంపేరు 1½, 2 ఫర్లాంగుల హద్దులలో నున్న ఆక్రమణదారుల, పట్టాదారుల సమావేశంలో ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

రొంపేరు యిరిగేషన్ డెవలప్‌మెంటు కమిటీ అధ్వర్యమున జరిగిన ఈ సభకు స్థానిక శాసనసభ్యుడు శ్రీ ప్రగడ కోటయ్యగారు అధ్యక్షత వహించారు. సభకుహాజరయినవారిలో శ్రీ వేమవరపు వెంకటేశ్వర్లు, శ్రీ బాచిన సుబ్బారావు, అక్కల కోటయ్య, బూదాటి వీరాస్వామిగార్లు ఉన్నారు. ప్రారంభంలో శ్రీ వేమవరపు వెంకటేశ్వర్లుగారు సమావేశ ఉద్దేశాలను వివరిస్తూ, ఆక్రమణదారులు ఈ విషయంలో విడివిడిగా ప్రయత్నం చేయక సమిష్టిగా కృషిసాగించాలని, అవసరమైనచో యిరిగేషన్ చీఫ్ ఇంజనీరు వద్దకు రాయబారములు నడపవలసి ఉంటుందని చెప్పారు.

అధ్యక్షతవహించిన శ్రీ కోటయ్యగారు మాట్లాడుతూ, ఈ విషయమై మళ్ళీ ప్రభుత్వానికి, చీఫ్ యింజనీరు గారికిచెప్పి ఈ ½ ఫర్లాంగు హద్దును తగ్గించేటట్లు కృషి చేద్దామని అన్నారు.

శ్రీ బాచిన సుబ్బారావు, బూదాటి వీరాస్వామిగార్లు ఉపన్యసించిన తరువాత పై చెప్పిన తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించారు. రొంపేరు బంజరుల పంపకమునకు జారీ చేయబడిన ఉత్తరువులకు కొన్ని సవరణలుసూచిస్తూ రొంపేరు యిరిగేషన్ డెవలప్‌మెంటు కమిటీ ప్రభుత్వానికి అందజేసిన విజ్ఞప్తిపై వెంటనే ఉత్తరువులు పంపవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేయబడింది. ఈ విషయాలన్నీ అధికార్లకు నివేదించుటకు శ్రీ ప్రగడకోటయ్యగారి నాయకత్వాన ఒక రాయబారవర్గాన్ని పంపుటకు తీర్మానించారు. అక్కలకోటయ్యగారి అభివందనములతో సభ ముగిసింది.

# మిల్లులలో నిలవ ఉన్న బియ్యం

## ప్రభుత్వమే కొనాలని విజ్ఞప్తి

భీమవరం, జూలై 28: భీమవరం మిల్లుయజమానులు కె. నాగభూషణం గారి అధ్యక్షతన సమావేశమై ప్రభుత్వ ఖాతాలో సేకరించబడి మిల్లులలో నిలవవున్న బియ్యం నిలవలన్నింటినీ స్వాధీనం చేసుకొని, డబ్బు ఇవ్వడం ద్వారా మిల్లు యజమానులకు సహాయపడవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు. అవసరాలకు తగ్గట్లు ఒకచోటినుంచి మరొకచోటికి బియ్యం స్వేచ్ఛగా ఎప్పుడూ రవాణా చెయ్యడానికి వీలుగా వాగన్లు వెంట వెంటనే ఇప్పించవలసిందిగా రైల్వే అధికారులను ఆదేశించమని ప్రభుత్వాన్ని కోరుతూ వేరొక తీర్మానం చేశారు. (స్వ. వి.)

# విద్యుచ్ఛక్తి శాఖ కార్మికుని దుర్మరణం

బాపట్ల, జూలై 29: శ్రీ ఎస్. బాషా అను 20 సంవత్సరములు వయసుగల విద్యుచ్ఛక్తిశాఖ కార్మికుడు విద్యుచ్ఛక్తి ప్రసారం సోకినందున 40 అడుగుల ఎత్తుగల స్తంభంనుంచి క్రిందపడి మరణించినాడు.

# భీమవరం మున్సిపల్ కమీషనరుకు ఇల్లు

## కౌన్సిల్ నిర్ణయం

భీమవరం, జూలై 28: ఈ పట్టణంలోని పి. ఎస్. ఎమ్. మున్సిపల్ బాలికోన్నత పాఠశాలకు ఇద్దరు బి. ఇ. డి. ఉపాధ్యాయులను మంజూరు చేస్తూ స్థానిక పురపాలక సంఘంవారి అవసర సమావేశంలో తీర్మానించారు. సమావేశానికి చైర్మన్ నాచు వెంకట్రామయ్యగారు అధ్యక్షత వహించారు. పురపాలక సంఘంవారి వివిధ విధులనుంచీ జాతీయ ప్రణాళిక రుణపత్రాలను కొనాలని నిర్ణయిస్తూ మరో తీర్మానం చేశారు. పురపాలక సంఘ కార్యాలయావరణలో దక్షిణవైపున మున్సిపల్ కమీషనరు నివాసానికి ఒక ఇల్లు నిర్మించి ప్రభుత్వం నిర్ణయించిన రేటు ప్రకారం కమీషనరువద్ద అద్దె వసూలు చెయ్యాలని వేరొక తీర్మానంలో నిర్ణయించారు.

# భట్టురాజ సంఘ ద్వితీయ మహాసభ

విజయవాడ, జూలై 25: ఆంధ్రదేశ భట్టురాజసంఘ ద్వితీయ మహాసభ యీ దినం శ్రీ ఎం. వి. మూర్తిరాజుగారి అధ్యక్షతన శ్రీ రామమోహన గ్రంథాలయ హాలునందు జరిగినది. శ్రీ గాది రాజు రామకృష్ణగారు స్వాగతమిచ్చారు. శ్రీ బడభాగ్ని నారాయణరాజుగారు మహాసభను ప్రారంభించారు. శ్రీ మల్లప్ప కొల్లూరు, పట్టాభి సీతారామయ్యగార్ల సందేశాలు శ్రీ చక్రాల తిరుపతిరాజుగారు చదివారు.

సహాయ కార్యదర్శి ప్రత్యేక నివేదిక చదివారు. పిదప పాతూరి నాగభూషణం, కడివేటి వరసారెడ్డి, ఎ. ఎస్. రాజశర్మ, ఎం. ఆర్యమూర్తి, శ్రీమతి సరస్వతమ్మగార్లు ఉపన్యసించారు. బళ్ళ రామచంద్రరాజుగారు రు. 16/-లు విరాళ మిచ్చారు.

సాయంత్రం వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయమందు తిరిగి సభ జరిగినది. వై. కె. వరదరాజు, హెచ్. రఘునాధరాజు, టి. పాపరాజు, వి. యల్. నారాయణరాజు, యం. రామమూర్తిరాజు, సి. హెచ్. మంగరాజు, ఊడుమూడి నారాయణరాజు, చక్రాల సుబ్బరాజు, కూరపాటి లింగరాజు, కోలాహలం అప్పలరాజు, బిరుదురాజు శ్రీరామరాజుగార్లు ఉపన్యసించారు.

సంఘ నూతన అధ్యక్షులుగ ఎం. వి. మూర్తిరాజు, ఉపాధ్యక్షులుగ కోలాహలం అప్పలరాజు, ప్రధాన కార్యదర్శిగ తాళ్ళభట్టు పాపరాజు గార్లను ఎన్నుకున్నారు.

# హైస్కూలు, కళాశాల విద్యార్థుల జీతాలు

## తగ్గించాలని ప్రదేశ్ విద్యార్థి కాంగ్రెసు వినతి

విజయవాడ, జూలై 30: ప్రస్తుత ఆర్థిక పరిస్థితులదృష్ట్యా కళాశాల, హైస్కూలు విద్యార్థుల జీతాలు తగ్గించాలని ప్రభుత్వాన్ని కోరుతూ జూలై 25-న జరిగిన ఆంధ్రప్రదేశ్ విద్యార్థి కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు. శ్రీ కోనేరు గోపాలకృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు.

హరిజన, వెనుకబడ్డ తరగతుల విద్యార్థులతోపాటు యితరవర్గాల్లో కూడా ఆర్థికంగా వెనుకబడి తగు అర్హత కలిగివున్న విద్యార్థులకు వుచిత విద్యార్థి వేతనాలివ్వాలనీ, విద్యార్థుల వద్దనుంచి వసూలుచేసే రుసుం (ఆటలు, వయోజన విద్య, మున్నగునవి) ఆయాశాఖలక్రింద సరిగా ఖర్చు చేయబడునట్లు చూడాలనీ హయ్యరు, సెకండరీ గ్రేడుల వుపాధ్యాయుల జీతాలు హెచ్చించాలనీ, అదనంగా టెక్నికల్ కళాశాలలు ప్రారంభించాలనీ, కళాశాలలో బి. ఇడి. సీట్లు పెంచాలనీ కూడా కోరుతూ తీర్మానాలు గావించారు.

# నూజివీడు, తిరువూరు జాతీయవిస్తరణ కేంద్రాలు

## మైనరు ఇర్రిగేషన్ స్కీములకు 60 వేలు, స్వల్పకాల ఋణాలకు 2 లక్షల మంజూరు

("ఆంధ్రపత్రిక" విలేఖరి)

విజయవాడ, జూలై 31: కృష్ణాజిల్లా ప్లానింగుకమిటీ సమావేశము ఈరోజు ఉదయం అధ్యక్షులు జనాబ్ అబ్దుల్ ఖాదర్ అధ్యక్షతక్రింద జరిగింది. జిల్లాలోని శాసనసభ్యులు పార్లమెంటు సభ్యులు వివిధశాఖల అధిపతులు జిల్లా ప్లానింగ్ ఆఫీసరు సాంబశివరావు నాయుడు, తిరువూరు జాతీయ విస్తరణ కేంద్ర నిర్వహణాధికారి శ్రీ జి. వి. చలపతిరావు, నూజివీడు కేంద్ర అధికారి శ్రీ సత్యనారాయణ, శ్రీమతి ఈడ్పుగంటి రత్నమాంబ, శ్రీ వల్లంకి విశ్వేశ్వరరావు మొదలయినవారు సమావేశమునకు వచ్చారు.

జిల్లాలోని పైనుదహరించిన రెండు కేంద్రాలలో అభివృద్ధి కార్యక్రమాల క్రింద దిగువవిధంగా ఖర్చు మంజూరు చేశారు.

### తిరువూరు కేంద్రం

గంపలగూడెం బావి నిర్మాణానికి రు. 7 వేలు, విస్సన్నపేట బావికి రు. 8 వేలు, హరిజనవాడ నూతిగట్టు నిర్మాణానికి రు. 1235/-లు, రాజవరం రోడ్డునుంచి చిత్తాలరోడ్డు నిర్మాణానికి రు. 10 వేలు, గంపలగూడెంలో రోడ్డుకు 6 వేలు, కత్తిలూరు నుంచి కోకిలంపాడు రోడ్డుకు 7 వేలు, మునికిపాడులో వాగుకు వంతెన నిర్మించటానికి రు. 10 వేలు, పెనుగోలను గ్రంథాలయ ప్రహరీగోడ నిర్మాణానికి రు. 700/-లు, తిరువూరు, గంపలగూడెం, చనుబండ గ్రామాలలో ప్రసూతికేంద్రాలకు రు. 800/-లు చొప్పున తిరువూరు, చిన్నమ్మపేట, చట్రాయి, పోలవరం గ్రామాల డిస్పెన్సరీలకు ఒక్కొక్కదానికి రు 1300/-ల వంతున ఊటుకూరు స్కూలు భవనానికి రు 5000, తుమ్మికపాడు స్కూలుభవనానికి రు 8000/-లు, గుళ్ళపూడి స్కూలు భవనానికి రు 1500/-లు, జీలకుంట్ల, చనుబండపుల్లేల, పెనుగోలను, ఊటుకూరు, తిరువూరు, కొండూరు, గ్రామాల్లో వయోజన పాఠశాలలకు రు 144/-ల వంతున, తిరువూరు, అల్లపాడు, గంపలగూడెం, చాట్రా, పోలిశెట్టిపాడుపుట్టాల, విస్సన్నపేట చనుబండ, పోలవరం, కొండూరు, రిక్రియేషన్ కేంద్రాలకు రు 500/-ల వంతున, పోలిశెట్టిపాడునుంచి తిరువూరు రోడ్డుకు కలిపే రోడ్డు నిర్మాణానికి రు 3065/-లు, రాజుపాలెం, రాజవరం రోడ్డుకు 1000/-లు, చింతలపాడు, హరిజనవాడరోడ్డు రు 2268/- పోలవరం, మంకొల్లురోడ్డుకు రు 5 వేలు పోలవరం, కొత్తపాడు రోడ్డుకు రు 4700/-లు, కంభంపాడు, కొండూరు రోడ్డు 4 వేలు, మునుకొల్లులో బావి నిర్మాణానికి రు 4410/-లు, తాళ్లదేవరపల్లిలో బావి నిర్మాణానికి రు 6342/- చాట్రాయిలో బావి నిర్మాణానికి రు 200/-లు, మారేపల్లిలో బావి నిర్మాణానికి రు 6606, రావూడిలో బావి నిర్మాణానికి రు 2877/-లు, మారేమండలో బావినిర్మాణానికి రు 3245, వినగడపలో బావి నిర్మాణానికి 800, పోలిశెట్టిపాడులో బావి నిర్మాణానికి రు 1000/-లు, కొమ్మూరులో 1025, ఊటుకూరులో రు 1800. యర్రమాడులో రు 8 వేలు, లక్ష్మీపురంలో రు 3225 లు, తిరువూరులో లైబ్రరీ ప్రారంభించుటకు రు 1000లు, విస్సన్నపేటలో లైబ్రరీకి రు 786/-లు, మైనరు ఇర్రిగేషన్ స్కీములకు ఋణాలక్రింద రు 30 వేలు, స్వల్పకాలిక ఋణ సౌకర్యాలకుగాను లక్ష రూపాయలు మంజూరైనవి.

### నూజివీడు కేంద్రం

నూజివీడు కేంద్రంలో ఖర్చు కార్యక్రమ వివరాలు:

అడవి నెక్కలం, అగిరిపల్లి, సింగనగూడెం, బోరవంచ, ఎనమదల, రమణక్కపేట, కాట్రేనిపాడు, కొయ్యూరు, వేలేరు, గొల్లపల్లి గ్రామాల వయోజనవిద్యా పాఠశాలలకు రు 244/-ల వంతున, అడవి నెక్కలం, అగిరిపల్లి, ఏదులగూడెం, నూజివీడు, ఎనమదల, రమణక్కపేట, ముసునూరు, కొయ్యూరు, గొల్లపల్లి వీరేరు గ్రామాల రిక్రియేషన్ కేంద్రాలకు రు 500/-ల వంతున, చక్కాలపల్లి మాదిచర్ల, ముసునూరు, సురవరం, పల్లెర్లమూడి, గ్రామాల డిస్పెన్సరీలకు రు 1040/-ల వంతున, ఈదర, చక్కాలపల్లి, మాదిచర్ల గ్రామాల శిశుసంక్షేమ కేంద్రాలకు రు 740/-ల వంతున, వీరేరు, మల్లవల్లి ప్రసూతి కేంద్రాలకు రు 740/- వంతున, పస్గూరు, చింతలపల్లి, కృష్ణవరం, గ్రామాలస్కూలు భవనాలనిర్మాణానికి రు 4 వేలు చొప్పున, ముసునూరు లైబ్రరీ భవనానికి రు 6 వేలు, బిల్లనపల్లి, గొల్లపల్లిస్కూలు భవనాలకు రు 4 వేలు చొప్పున అడవి నెక్కలం డిస్పెన్సరీకి రు 4 వేలు, నూజివీడులో కక్కొసు దొడ్లనిర్మాణానికి రు 6 వేలు, గుళ్లపల్లిలో రోడ్లనిర్మాణానికి రు 8 వేలు, మల్లవల్లిలో బావినిర్మాణానికి రు 552/-లు, అనంతసాగరంలో రు 2100/-లు, శోభనాపురంలో రు 5500/-లు, అక్కిరెడ్డిగూడెం రు 4 వేలు, హనుమంతగూడెం రు 2 వేలు, కండ్రిక 245, కొత్తపల్లి రు 720, అనమదల (ట్యూబ్ బోరింగు) 1640, మాదిచర్ల 2 వేలు, అగిరిపల్లి రు 960, రంగనగూడెంరోడ్డు 500, కొత్తమల్లివల్లిలో పాఠశాలకి అభివృద్ధికి రు 1500, అన్నవరంలో రు 1000, సీతారాంపురం 1200, అన్నారావుపేట 1500, వరసపూడి 900, రమణక్కపేట రు 900, తోటపల్లిలో బావి నిర్మాణానికి రు 6400, కేసన్నపల్లి రు 4500, చక్కాపల్లి 5100, గోకులంపాడు 5100, రావిచర్ల 5100, ఈదర 7200, అన్నవునేనివారిగూడెం 6000, మైనరు ఇర్రిగేషన్ స్కీముల క్రింద ఋణాలకుగాను రు 30 వేలు, స్వల్పకాలిక ఋణసౌకర్యాలకుగాను లక్ష రూపాయలు మంజూరైనవి.

# విజయవాడ పట్టణ కాంగ్రెసు సమావేశం

## ప్రజా సంఘాల స్థాపనకు ఉపసంఘాలు

విజయవాడ, జూలై 26: పట్టణ కాంగ్రెసు కార్యవర్గం నిన్న శ్రీ మరుపిళ్ల చిట్టిగారి అధ్యక్షతన సమావేశమై విద్యార్థి, మహిళా, కార్మిక, సంఘాలను ఆర్గనైజు చేయుటకు గాను దిగువవారితో కమిటీలు నియమించారు. వెనుకబడిన జాతుల కమిషన్‌కు ఆగస్టు 6న నివేదిక సమర్పించాలని నిర్ణయించారు.

విద్యార్థి, విజ్ఞానసంఘములను ఆర్గనైజు చేయుటకు, శ్రీ ములైల శ్రీరామమూర్తిగారు (కన్వీనరు), శ్రీ కుంచేటి సత్యనారాయణ, శ్రీ గుళ్లపల్లి శ్రీరాములు చౌదరి, శ్రీ మరుపిళ్లచిట్టి, శ్రీ ముమ్మనేని వెంకయ్యగార్లు.

వాణిజ్యసంఘములను, ఆర్గనైజు చేయుటకు, శ్రీ చింతా సర్వారావు గారు(కన్వీనరు), శ్రీ బుద్ధా రాములు, శ్రీ మాజేటి రామమోహనరావు, శ్రీ గుడివాడ వీరరాజు, శ్రీ పచ్చిపులుసు వెంకటసుబ్బారావు, శ్రీ అన్నవరపు కామేశ్వరరావు, శ్రీ చింతపల్లి కృష్ణమూర్తి, కొత్తూరు రాధాకృష్ణమూర్తి, అనుమాలశెట్టి శ్రీరాములు, శ్రీ మరుపిళ్ల చిట్టిగార్లు.

పట్టణ ప్రజారోగ్య రవాణాసంఘములను ఆర్గనైజు చేయుటకు శ్రీ దిట్టకవి వీరరాఘవయ్య డాక్టరు జంధ్యాల దక్షిణామూర్తి, శ్రీ పోతినగణపతిరావు పాత్రుడు, శ్రీ విశ్వనాధకోమటశంకరశాస్త్రి, శ్రీ కళ్లేపల్లి కనకరాజు, శ్రీ మరుపిళ్ల చిట్టి, శ్రీ ముమ్మనేని వెంకట్రామయ్యగార్లు.

మహిళాసంఘములను ఆర్గనైజుచేయుటకు శ్రీమతి అయ్యదేవర బాలత్రిపురసుందరమ్మగారిని కన్వీనరుగా నియమించడమైనది.

కార్మికసంఘములను ఆర్గనైజుచేయుటకు: శ్రీ వర్రె రాములుగారు కన్వీనరు, శ్రీ పాలేరు వెంకట్రామయ్య, శ్రీ రెడ్డపల్లిసూర్యనారాయణ పైడిముక్కల కనకయ్య, శ్రీ పదిర సుబ్బయ్య, శ్రీ మానుకొండ వెంకటేశ్వర్లు నడికట్ల శంకరం, శ్రీ మరుపిళ్ల చిట్టి, ముమ్మనేని వెంకట్రామయ్యగార్లు.

మహమ్మదీయ సంఘములను ఆర్గనైజుచేయుటకు శ్రీ జనాబ్ అబుల్ రహిమాన్ సాహెబ్‌గారిని కన్వీనరుగా నియమించడమైనది.

క్రైస్తవ సంఘములను ఆర్గనైజుచేయుటకు శ్రీ సంబారి పద్మనాభంగారిని నియమించారు.

హరిజనసంఘములను ఆర్గనైజుచేయుటకు, శ్రీ మేదర చింతయ్యగారు కన్వీనరు, పైడిముక్కల కనకయ్య, శ్రీ మరుపిళ్ల చిట్టి, శ్రీ ముమ్మనేని వెంకట్రామయ్యగార్లు.

# శ్రీ అయ్యగారి వెంకట సుబ్బారావుగారి చిత్రపటావిష్కరణ

బరంపురం, జూలై 27: గంజాం ప్రముఖ న్యాయవాది శ్రీ అయ్యగారి వెంకటసుబ్బారావు పంతులుగారి చిత్రపటాన్ని ఒరిస్సా ప్రధాన న్యాయమూర్తి శ్రీలింగరాజ పాణిగ్రాహి నిన్న న్యాయవాదసంఘ హాలులో ఆవిష్కరిస్తూ న్యాయమూర్తులకు, న్యాయవాదులకు గల పరస్పర సంబంధాలు వివరించారు.

సాంఘికవ్యవస్థకు న్యాయవాదులు తమ వృత్తిద్వారా దోహదమివ్వలేరన్న ఆరోపణను శ్రీపాణిగ్రాహి ఖండించారు. నేటి న్యాయవిధానంలో న్యాయవాదుల పాత్రనుగురించి చెప్పారు. న్యాయవాదుల, న్యాయమూర్తుల మధ్య సంబంధాలు ప్రతీకారంగా లేదన్న వాదన అర్థరహితమని వివరించారు.

శ్రీ దీనబంధుదాసు, యస్. వి. రంగనాథం, హయగ్రీవపండా, ఎల్. బలరామదాసుగార్లు శ్రీ సుబ్బారావుగారిని ప్రశంసిస్తూ ప్రసంగించారు.

# అఖిల హైద్రాబాద్ వ్యాపార మహాసభ

## ఆహ్వాన సంఘాధ్యక్షుని వివరణ

హైద్రాబాద్, అగస్టు 1: ఈ నెలాఖరులో, లేదా సెప్టెంబరు ప్రారంభంలోనో, జరిగే అఖిల హైద్రాబాద్ ప్రథమ వ్యాపార మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడు ముకుంద్ దాస్ మోహన్ లాల్ మలానీగారు ఇవాళ పత్రికా ప్రతినిధులతో మాటలాడుతూ ఇండియా వాణిజ్య, పరిశ్రమల మండలుల ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ బి. ఎమ్. బిర్లాను మహాసభకు అధ్యక్షులుగా ఆహ్వానించటానికి నిర్ణయించటం జరిగిందన్నారు. ఈ మహాసభ సందర్భంలో ఫెడరేషన్ కార్యవర్గ సమావేశం హైదరాబాద్ లో జరపమనికూడా కోరామన్నారు. రాష్ట్రంలోని దాదాపు 55 వాణిజ్య సంస్థలు ఆహ్వాన సంఘంలో చేరినవనీ, వ్యాపారస్థుల కోరికలను వ్యక్తపరచటానికే కాకుండా, జాతీయాభివృద్ధి కార్యక్రమాలపట్ల వాణిజ్య సంస్థలు ఎట్టి దృక్పథాన్ని కలిగి ఉండాలో చర్చించి, పంచవర్ష ప్రణాళికలను ఇతోధికంగా తోడ్పడటానికి కూడా యీ మహాసభ ఉద్దేశించబడిందన్నారు.

రాష్ట్రంలోని వ్యాపారస్థులందరూ ఈ మహాసభ విజయానికి అన్నివిధాలా తోడ్పడాలని శ్రీమలానీ విజ్ఞప్తిచేశారు.

# హైద్రాబాద్‌లో కుంభవృష్టి

## ఒక్క రోజులో 15 దుక్కులు

హైద్రాబాద్, అగస్టు 1: హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలలో ఇవేళ ఉదయం 8 గంటలకు పూర్తి అయిన 24 గంటలలో 7.5 అంగుళాలు (పదిహేను దుక్కులు) వర్షం కురిసింది. హైద్రాబాద్ లో జూన్ 1 వ తేదీ నుంచి ఇంతవరకు కురిసిన వర్షం మొత్తం 14.5 అంగుళాలు (29 దుక్కులు) వర్షం కురిసిందనీ, దానిలో నిన్న ఒక్కరోజునే సగానికిపైగా కురిసిందనీ బేగంపేట అబ్జర్వేటరీ అధికారులు చెప్పారు. సూర్యుడు కనిపించిన కొద్ది వ్యవధిలో మినహా, ఇవాళ రోజంతా కారుమబ్బులతో ఆకాశంనిండి ఉంది.

కుండపోతగా కురిసిన వర్షంవల్ల నగరంలోని పల్లపుప్రాంతాలన్నీ జలమయమయాయి. చెదురుగా కొద్దిగా ఇండ్లుకూలిపోయినట్లు తెలియవచ్చింది. రెండునగరాల కార్పొరేషనులు వర్షాకాలానికి పూర్వమే కూలిపోయే ప్రమాదస్థితిలో ఉన్న ఇండ్లను పేర్కొని, ఖాళీచేసి మరమ్మతులు చేయించాలనీ, లేదా పూర్తిగా పడగొట్టివేయాలనీ కోరాయి. అతివృష్టి కారణంగా కొన్ని పండ్లతోటలు నష్టపడ్డట్లు కూడా తెలిసింది. (స్వ. వి.)

# హైదరాబాదు వుద్యోగులలో అవినీతి నిర్మూలన

సికిందరాబాద్, జులై 31: ప్రభుత్వోద్యోగుల్లో అవినీతి, లంచగొండితనం, రూపుమాపేందుకు గాను 1950 లో అమలులోకొచ్చిన పబ్లిక్ సర్వెంట్సు విచారణచట్టం కొంతవరకు అవినీతి నిర్మూలనలో సహాయపడినట్లు అధికారవర్గాలద్వారా తెలియవచ్చినది.

1952 జూన్ 1 నుంచి 39 కేసులు ట్రిబ్యునల్ వారు విచారించారు. ఇందులో 20 మంది గెజిటెడ్ ఉద్యోగులు, 19 మంది యన్. జి. వోలు. 9 విచారణలో వున్నవి. 6 గురికి శిక్షలు విధించబడ్డాయి. (యు. పి. ఐ.)

# సికింద్రాబాద్ జిల్లాకాంగ్రెసు

సికింద్రాబాదు, అగస్టు 1: శ్రీ ఎస్. ఆర్. వెంకటేశంగారి రాజీనామా కారణంగా ఏర్పడిన అధ్యక్షఎన్నిక విషయంలో నిర్ణయం చేయ్యటానికి సికింద్రాబాద్ జిల్లా కాంగ్రెసు సంఘం తిరిగి ఈ నెలాఖరుకు సమావేశమవుతుంది. (స్వ. వి.)

# ఆంధ్రా పేపరు మిల్లు కార్మికుల యూనియన్

రాజమండ్రి, జూలై 31: ప్రభుత్వ ఆంధ్రా పేపరుమిల్లు కార్మికుల యూనియన్ వార్షిక సర్వసభ్య సమావేశం నిన్న సాయంత్రము శ్రీ మంచిరాజు చంద్రశేఖరం అధ్యక్షతను జరిగింది. 1953-54 సం॥ తాలూకు ఆడిటు చేయబడిన జమాఖర్చుల లెక్కలు ఏకగ్రీవంగా ఆమోదించారు. నూతన కార్యవర్గ ఎన్నికలు జరిగాయి. శ్రీ మంచిరాజు చంద్రశేఖరం (అధ్యక్షులు) శ్రీ సిరపు అప్పలస్వామి (ఉపాధ్యక్షులు) శ్రీ యార్క సూర్యారావు (కార్యదర్శి) శ్రీ చీకట్ల ఖుల్లిరాజు (సహాయకార్యదర్శి) శ్రీ మంగరెంపల్లి ప్రభాకరం (కోశాధిపతి)గా ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

# టిక్కెట్టు లేని ప్రయాణీకులు

మద్రాసు, జూలై 30: నేను పెరంబూరు ఎన్నూర్ స్టేషనులలో 128 మంది టిక్కెట్లులేని ప్రయాణీకులను అధికారులు పట్టుకున్నారు.

నిన్న యీ రీతిగా దొరికిన 300 మందిలో 92 మంది జరిమానాలు చెల్లించలేక జైలుకెళ్ళారు. తతిమ్మవారు మొత్తం రూ. 500 జరిమానా చెల్లించారు.

# గుంటూరుజిల్లా చెంపాడు ఖూనీ కేసులో ఇద్దరికి ఉరిశిక్ష

## నలుగురికియావజ్జీవఖైదు: సెషన్సుజడ్జితీర్పు

గుంటూరు: జులై 31: చెంపాడు ఖూనీ దొమ్మీ కేసులోని 14 మంది ముద్దాయిలలో 7 గురికి శిక్షవిధిస్తూ, గుంటూరు సెషన్సుజడ్జి శ్రీ వి. పోలారెడ్డిగారు నిన్న తీర్పుచెప్పారు.

ఈ 7 గురిలో ఇద్దరికి మరణ శిక్ష, 4 గురికి యావజ్జీవ ఖైదు, యింకొకనికి 2 ఏళ్ళ కఠినశిక్ష విధింపబడింది.

ముద్దాయిలపై ప్రాసిక్యూషన్‌వారు మోపినకేసు 1953 జూన్ 6 వ తేదీ సాయంత్రం 4 గం॥ కు తెనాలి సమీపంలోని చెంపాడు గ్రామంలో ఆక్రమముగా చేరి, ఎదుటిపక్షంలోని కవ్యాధర పానకాలయ్య, మది మల్లి సుబ్బారావులను కొటాలని కుట్రపన్ని దొమ్మీజరిపి ఐ. పి. 148 సెక్షన్ క్రింద శిక్షార్హమైన నేరంచేశారు. ఆ సమయంలో వారి చేతుల్లో మారణాయుధాలుకూడా ఉన్నవి.

చెంపాడుగ్రామంలో గత 5,6 ఏళ్లబట్టి కక్షలున్నట్లు ప్రాసిక్యూషన్ సాక్ష్యం తెలుపబడింది. హత్యగావింపబడిన పానకాలయ్య, ఒక పార్టీకి చెందిన వ్యక్తి సుబ్బారావు. మరికొందరుగూడా యీ పార్టీలో అన్నారు. ఎదిటి పక్షంలో గ్రామ మునసబుగూడా ఉన్నారు. గ్రామ మునసబుకు, పి. హెచ్. వరసయ్య అను వతనికి, భూమి విషయంలో తగాదా ఉండేను. ఉభయపక్షాలకు మధ్య సివిల్ క్రిమినల్ కేసులు గూడా ఉండినవి. ఈ సంఘటనకు ఒక నెలముందు, గ్రామంలో పంచాయతీబోర్డు ఎన్నికలు జరిగినవి. 2 వ ముద్దాయికే సాదిజోగయ్య, 4 వ ముద్దాయి నలంపాటి బసవపున్నయ్య 5 వ ముద్దాయికేసాని ప్రహ్లాదరావు ఎన్నికలలో, సుబ్బారావుపైన పోటీ చేశారు. సుబ్బారావు ఎన్నికలలో గెలుపొంది పంచాయతీ బోర్డు ఉపాధ్యక్షుడుగా ఎన్నికైనారు.

జూన్ 6 వ తేదీ ఉదయం ప్రాసిక్యూషన్ సాక్షులలో ఒకరు, యింకొకరి దగ్గర తమకు క్రయం పొందినట్లుగా చెప్పి, ఒక పొలంలో తాటియాకులు కోశాడు. ముద్దాయీలకు యీ సంగతి తెలియరాగానే కోసిన ఆకులు కట్టగట్టి ఎత్తుకొని పోదామని ఆ పొలానికి వెళ్లారు. మరో యిద్దరు పెద్ద మనుష్యులు, ప్రమేయం కల్పించుకొని, ఉభయ పార్టీల వారు, తాటియాకులు గురించి అనవసరంగా తగాదా పడవద్దని సర్దిచెప్పారు. ఇది మధ్యాహ్నం 2 గంటలప్పుడు జరిగింది. కాని అదే రోజు సాయంత్రం 4 గం॥కు. పానకాలయ్య (హత్య గావింపబడిన వ్యక్తి) పశువుల కొష్టం నుంచి బయటికి తిరిగివస్తున్నాడు. ఆయన ఇల్లుకుప్రక్కగా ఉన్న 2 వ ముద్దాయి యింటి నుంచి 1 వ ముద్దాయి కేసానిమురహరిరావు, 2 వ ముద్దాయికే సాని జోగయ్య, 3 వ ముద్దాయి రామయ్య, 4 వ ముద్దాయి నీలంపాటి బసవపున్నయ్య బయటికి వచ్చి, అతనిని చుట్టు ముట్టారు. 1 వ ముద్దాయి పానకాలయ్యను బాకుతో పడిడొక్కలో పొడిచాడు. 4వ ముద్దాయి గొడ్డలితో వీపుమీద వేటు వేశాడు. 3 వ ముద్దాయి గొడ్డలికర్రతో మోదాడు. 2 వ ముద్దాయి చేతిలో తుపాకిగూడా ఉన్నది. అతను పానకాలయ్యను ఒక్క తన్నుతన్ని, చచ్చాడు అని అన్నాడు.

ఈసమయంలో మిగతా ముద్దాయిలు కూడా బయటకువచ్చి, 1, 2, 3, 4 ముద్దాయిలతో చేరి యింకొక వ్యక్తి యింటికివెళ్ళాడు. అవ్యక్తిని 1ముద్దాయి బల్లెంతో పొడిచాడు. 3 వ ముద్దాయి, 9 వ ముద్దాయి బల్లెంతోనూ కర్రలతోనూ కొట్టారు."

పానకాలయ్యను హత్యచేశారని 1, 3, 4 ముద్దాయిలపై 302 సెక్షనుల క్రింద నేరం మోపారు. 2 వ ముద్దాయి హత్యకు ప్రోత్సాహమిచ్చాడని నేరం మోపారు.

యం. సుబ్బారావును హత్య చేశారని 2, 4, 5, 6, 9, 12 ముద్దాయిలపై 302 సెక్షన్ క్రింద నేరం మోపారు. 7, 8, 10, 11, 13, 14 ముద్దాయిలపై 148 సెక్షన్‌తో చేర్చి 302 సెక్షన్ క్రింద నేరంమోపారు. మారణాయుధాలతో తీవ్రంగా గాయపరిచారని 1, 3, 4, 9, 10, 11 ముద్దాయిలపై 326 సెక్షన్ క్రింద నేరం మోపారు.

ముద్దాయిలు తాము నేరం చేయలేదని వాదించారు.

అడిషనల్ సెషన్సుజడ్జిగారుసాక్ష్యమును సవిమర్శగా పరిశీలించిన పిమ్మట పైనజెప్పిన విధంగా 7 గురికి శిక్ష విధించి, మిగతా 7 గురిని విడుదల చేశారు.

ప్రభుత్వం తరఫున అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటరు శ్రీ యం. హనుమంతరావుగారు, శ్రీయుతులు గోపాల కృష్ణమూర్తి, జి. సుబ్బారావు గారల సహాయంతోనూ, ముద్దాయి తరఫున శ్రీయుతులు డి. ఎల్. నారాయణ, యం. నరసింహారావు, కె. కృష్ణరావు గారలు వాదించారు.

# సబ్‌జడ్జీల నియామకం

గుంటూరు, జూలై 31: శ్రీ యం. రామమూర్తిగారు సెలవు పూర్తికాగానే నెల్లూరు ఫస్టు అడిషనల్ సబ్ జడ్జిగా శ్రీ భాస్కర రాజుగారిస్థానే నియమించబడినారు.

శ్రీ బి. భాస్కరరాజుగారు నెల్లూరు సెకండు అడిషనల్ సబ్ జడ్జిగా (క్రొత్త పదవి) నియమించబడ్డారు.

# కొండజాతుల అభివృద్ధికి కృషి

## ఆర్థిక సహాయ సంస్థ నెలకొల్పడానికి ఆమోదం

కర్నూలు, అగస్టు 1: కొండ జాతులకు సహాయ పడడానికి గాను రెండు లక్షల రూపాయల వాటా మూల ధనంతో (ఫైనాన్సింగ్ అండ్ మార్కెటింగ్ కార్పొరేషన్) ఆర్థిక సహాయ వస్తు క్రయ విక్రయ సంఘాన్ని నెలకొల్పే పథకాన్ని ఇటీవల ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో ఆంధ్రరాష్ట్ర కొండజాతుల సలహా సంఘం ఆమోదించింది. రెండు లక్షల రూపాయల ఖర్చు అంచనాతో మలేరియా కంట్రోలు ప్రణాళిక నొకదానినీ, లక్షన్నర రూపాయల ఖర్చు అంచనాతో 'యాస్' వ్యాధి కంట్రోలుకు వేరొక పథకాన్నీ కూడా ఈ సంఘం ఆమోదించింది.

ప్రభుత్వం ఇదివరకే మంజూరు చేసిన పదిహేను లక్షల రూపాయల గ్రాంటు నుంచి ఈ స్కీముల ఖర్చుకు కావలసిన డబ్బు తీసుకొంటారు.

ఏజన్సీ ప్రాంతంలోని మారేడుమల్లి నుంచి చెన్నూరుకు ఒకరోడ్డు, చెన్నూరునుంచి కూనవరానికి మరొక రోడ్డు మొత్తం రెండు రోడ్ల నిర్మాణానికి భారత ప్రభుత్వం ముప్ఫయి రెండు లక్షల రూపాయల గ్రాంటు ఇచ్చారు.

భారత ప్రభుత్వానికి పంపించబడిన కొండజాతుల సంక్షేమ స్కీములన్నింటినీ కూడా ఈ సంఘం ఆమోదించింది. (స్వ. వి.)

# గ్రామీణ జీవన వ్యయ సూచిక

కర్నూలు, జూలై 29: 1954 మార్చిలో యీ క్రింది గ్రామీణ ధరలకు సంబంధించిన సూచికను ప్రభుత్వం ఇవాళ ప్రకటించింది.

తంగికేంద్రంలో 20 పాయింట్ల తగ్గుదల కనిపించింది. ఆహార పదార్థాలైన బియ్యం, కందిపప్పు, చింతపండు, బెల్లం ధరల తగ్గుదల మూలంగా జీవన వ్యయ సూచికలో 20 పాయింట్లు, కిరసనాయిల్ ధరలో తగ్గుదల వల్ల దీపాల వ్యయ సూచికలో 8 పాయింట్లు, ఇతర వస్తువులలో 18 పాయింట్లు తగ్గుదల ఉంది. బట్టల విషయం గత నెలలో మాదిరిగానే నిలిచిపోయింది.

అదివారం కేంద్రంలో కొద్ది పెరుగుదల కనిపించింది. వస్త్రాల సంబంధంలో 2 పాయింట్ల పెరుగుదల, యితర వస్తువుల ధరలలో 2 పాయింట్ల తగ్గుదల మిగతావి యథాతథంగా ఉన్నాయి.

అలమూరు కేంద్రంలో జీవనవ్యయ సూచికలో 1 పాయింటు పెరిగింది. వస్త్రాల విషయంలో 7 పాయింట్లు, ఇతర వస్తువుల విషయంలో మూడు పాయింట్లు పెరుగుదల ఉంది. ఆహార పదార్థాల విషయంలో మార్పేమీ లేదు.

మాధవరం కేంద్రంలో జీవనవ్యయ సూచికలో 6 పాయింట్లు పెరుగుదల కనిపించింది. ఆహార పదార్థాలలో 10 పాయింట్లు, ఇతర వస్తువులలో 28 పాయింట్లు పెరిగింది. వస్త్రాలు, దీపాల ఖర్చు విషయంలో మార్పేమీ లేదు.

# జైళ్ళలో వున్న గీతపనివాళ్లు

## శ్రీ వి. వి. రమణ విజ్ఞప్తి

దానవాయిపేట, జులై 30: రాజమండ్రి సెంట్రల్ జైలులో వున్న మాజీ గీత పనివారలను తాము కలుసుకున్నామనీ, జైలు అధికారుల వైఖరికి తాము హర్షిస్తున్నామనీ, అయితే ఆ ఖైదీలను రాజకీయ ఖైదీలుగా చూడాలనీ, పార్లమెంటు సభ్యుడు శ్రీ వి. వి. రమణ విజ్ఞప్తి చేస్తున్నారు.

# శ్రీనీరుకొండ రామారావు గారి ప్రకటన

దానవాయిపేట, జులై 30: కృషికార్ లోక్ పార్టీ సమావేశంలో తాము గీతపనివారల వుద్యమాన్ని వ్యతిరేకించామని కొన్ని పత్రికల్లో ప్రచురింపబడిన వార్త అబద్ధమనీ, అనారోగ్య కారణాలవలన తాము కృషి చేయలేక పోయామనీ, రామమూర్తికమిటీ నివేదికను బలపరచిన పార్టీలన్నీ యీ వుద్యమాన్ని బలపరచాలని కోరుతూ కె. ఎల్. పి. శాసనసభ్యుడు శ్రీ ఎన్. వి. రామారావుగారు ప్రకటిస్తున్నారు.

# ప్రదేశ్ గీతపనివారల కాంగ్రెసు సమావేశం

రాజమండ్రి, జూలై 31: ఆంధ్రదేశ గీతపనివారల కాంగ్రెసు కార్యవర్గ సమావేశం యీదినం శ్రీ కాసాని అప్పారావుగారి అధ్యక్షతన జరిగింది. సుమారు 40 మంది ప్రతినిధులు పాల్గొన్నారు.

అధ్యక్షులు మాట్లాడుచూ సంఘ కార్యకలాపాలు సమీక్షించారు. లచ్చన్న గారి వైఖరిని ఖండించారు. ప్రభుత్వవిధానం ఎంత ప్రయోజనకరమో వివరించారు. మరీదు కోటేశ్వరరావు, కడ్డలి కృష్ణమూర్తిగార్లు అప్పా రావుగారిని సమర్థిస్తూ ప్రసంగించారు.

తాటిబెల్లం అభివృద్ధిస్కీము సలహా సంఘంలో శ్రీ కాసాని అప్పారావు గారిని సభ్యులుగా తీసుకున్నందుకు కృతజ్ఞత ప్రకటిస్తూ సమావేశంలో తీర్మానించారు. బంజరు భూముల సక్రమపంపిణీకి తగు యేర్పాట్లుచేయాలని తీర్మానించారు. నీరా దుకాణాలు తెరుచుటలో ప్రభుత్వానికి సలహా యివ్వాలని నిర్ణయించారు. (స్వ. వి.)

# విదేశీసారాల అనుమతి

## నిబంధనల సడలింపు: ఆంధ్రప్రభుత్వ పరిశీలన

కర్నూలు, అగస్టు 1: విదేశాలనుంచి సారా తెప్పించుకోవడానికి అనుమతులు ఇచ్చే నిబంధనలను సవరించడం ఎలాగనే విషయంగురించి ఆంధ్రప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తున్నది. విదేశాలనుంచి సారా తెప్పించుకొనగోరే వారికి అనుమతులు ఇచ్చే విషయంలో అట్టి అనుమతులు కావాలని కోరేవారి స్తోమత, నిజంగా వారి ఆ అనుమతులు కావాలా అనే రెండు ముఖ్యవిషయాలు ప్రధానంగా పరిశీలించబడుతవని మద్యనిషేధశాఖమంత్రి ఎస్. బి. పి. పట్టాభిరామారావుగారు నిన్న సాయంకాలం ఇక్కడ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

ఈ వ్యవహారమంతా సమగ్రంగా పరిశీలించి నివేదిక పంపించవలసిందిగా రెవిన్యూబోర్డును కోరగా రెవిన్యూబోర్డు అట్టి నివేదికను పంపించిందనీ ఇప్పుడు అది తమ పరిశీలనలో ఉన్నదనీ మద్యనిషేధశాఖమంత్రి సూచించారు.

మదరాసువంటి ఇరుగు పొరుగు రాష్ట్రాలనుంచి కావలసిన సారా తెప్పించుకునే విషయంలో అనవసరమయిన ఇబ్బందులు రాకుండా ఉండడానికి వీలుగా ఆంధ్రలో వ్యాపారంచేస్తున్న వారికి విదేశాలనుంచి సారా దిగుమతి చెయ్యడానికి అవసరమయిన లైసెన్సులు ఇవ్వబడుతవనికూడా పట్టాభిరామారావుగారు సూచించారు. ఇట్టి యేర్పాటువల్ల రాష్ట్రప్రభుత్వానికి అమ్మకం పన్నుద్వారా కొంత ఆదాయం సమకూరే అవకాశంకూడా ఉంటుందని ఆయన చెప్పారు. (స్వ. వి.)

# విజయవాడలో ప్రాచ్యవిద్యాకళాశాల

## ఈ నెల మూడవ వారంలో ప్రారంభం

విజయవాడ, అగస్టు 1: హైదరాబాదు హిందీ ప్రచార సభవారు ఇచట ప్రారంభించనున్న ఆంధ్ర ప్రాచ్య విద్యా కళాశాల విద్యా సంవత్సరం యీ నెల 3 వ వారంలో ప్రారంభం కాగలదని ఆర్గనైజరు తెలిపారు. ఈ కళాశాలకు ఆంధ్ర విశ్వవిద్యాలయం గుర్తింపు కలదనీ హిందీ, తెలుగులలో భాషాప్రవీణ కోర్సు బోధించబడగలదని కూడ చెప్పారు.

# కృష్ణాజిల్లా వెనుకబడిన ప్రజల సంఘం

కృష్ణాజిల్లా వెనుకబడిన ప్రజల సంఘ సర్వసభ్యసమావేశం నిన్న జరిగిన నూతన సంవత్సరానికి శ్రీ గాలి రత్నంగారు అధ్యక్షులుగ, శ్రీయుతులు మల్లిపూడి రాజేశ్వరరావు, యం. యల్. ఏ. యం, అర్జునదాసు గారలు ఉపాధ్యక్షులుగ, శ్రీ యం. అబ్రహాంగారు కార్యదర్శిగ నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది.

జిల్లాలోని ప్రతి తాలూకాకు ఒక ఆర్గనైజరును నియమించాలని నిర్ణయించబడింది.

అగస్టు ఐదవ తేదీన విజయవాడవస్తున్న వెనుకబడిన జాతుల కమీషనుకు సమర్పించవలసిన విజ్ఞాపన ముసాయిదాను ఆమోదించారు.

# ఆంధ్రలో సున్నపురాయి

మద్రాసు, అగస్టు 1: ఆంధ్ర రాష్ట్రంలో సున్నపురాయి విరివిగా దొరకే అవకాశాలు ఉన్నందున సోడాయాష్ ఫ్యాక్టరీని నెలకొల్పే ప్రతిపాదన కేంద్రప్రభుత్వ ఆలోచనలో ఉన్నట్లు తెలుస్తోంది. దీనికి ఆరుకోట్ల రూ॥లు అవుతుందనీ, వాత్తేరులో చక్కని రాయి, నీరు సరఫరా అయితే యీ ఫ్యాక్టరీ అక్కడే పెట్టవచ్చుననీ తెలుస్తోంది. యీసందర్భంలో భారత ప్రభుత్వ అభివృద్ధి అధికారి శ్రీ ఎన్. శ్రీనివాసన్, సలహాదారు శ్రీ అథియా ఆంధ్ర సర్కారుల డెప్యూటీడైరక్టరు పోలి రెడ్డిగారలు ఆంధ్రదేశంలోని కొన్ని ప్రదేశాలు చూసివచ్చారు. గుంటూరు జిల్లాలోని పల్నాడు ప్రాంతాన్ని వాత్తేరుదగ్గిర అనంతగిరి ప్రాంతాలను వారు చూసివచ్చారు.

# ప్రత్తిపంట ప్రమాణం: కేంద్రసంఘ నిర్ణయం

బొంబాయి, జులై 31: రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో అంటే 1960-61 సంవత్సరంనాటికి దేశంలో 55 లక్షల బేళ్ల ప్రత్తి తయారు కావాలని ప్రమాణం నిర్ణయించాలని కేంద్ర ప్రత్తి సంఘంవారు నేడు సిఫార్సు చేశారు.

వీరి ఈ సిఫార్సులో మొదటి పంచవర్షప్రణాళిక తాలూకు తుది సంవత్సరంలో ప్రత్తిపంట ప్రమాణం 42 లక్షల బేళ్లుగా వుండాలని సూచా పేర్కొన్నారు.

# ఉక్కు ఇనుము సప్లయి సలహా సంఘం

## 9 మంది సభ్యులతో యేర్పాటు

కర్నూలు, జులై 31: ఇనుము, ఉక్కు ప్రజలకు అందుబాటులో వుండే ధరలకు పంపిణీచేసే వ్యవహారానికి సంబంధించిన విషయాలన్నింటిలో తగిన సలహాలు ఇవ్వడానికిగాను ఆంధ్రప్రభుత్వం రాష్ట్ర ఉక్కు సలహా సంఘాన్ని ఏర్పాటుచేసింది.

ఈ సలహా సంఘంలోని తొమ్మిది మంది సభ్యుల వివరాలివి :

(1) ఆంధ్ర రాష్ట్ర కంట్రోలు వస్తువులశాఖ డైరెక్టరు- అధ్యక్షుడు (2) పరిశ్రమలు, వాణిజ్యశాఖల సహాయ డైరెక్టరు (3) వ్యవసాయ మత్స్య సంపదభివృద్ధిశాఖల డైరెక్టరు, (4) సహకారసంఘాల రిజిస్ట్రారు ఉద్యోగరీత్యా సభ్యుడు (5) శాసనసభ్యుడు పి. రంగారెడ్డి (6) విజయవాడలో రిజిస్టరయిన ఉక్కు - ఇనుము వ్యాపారస్థుడు శ్రీ పి. దుర్గారావ్ (7) శ్రీ ఎన్. శేషగిరిరావ్ రాజమండ్రి (8) అబ్దుల్ కరీమ్ మనియార్ - ఆదోని (9) దొంత భీమయ్యశెట్టి - హిందూపురం.

కంట్రోలు వస్తువులశాఖ డైరెక్టరు కార్యాలయంలోని ఉక్కు సప్లయిశాఖ ఉద్యోగి ఈ సంఘంలో సభ్యత్వం లేని కార్యదర్శిగా వ్యవహరిస్తారని కూడా నేడు వెలువడిన ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది. ఈ సంఘం ఒక సంవత్సరంపాటు అధికారంలో ఉంటుంది. ఈ సంఘంచేసే సూచనలన్నీ సలహాలుమాత్రమే.

ప్రభుత్వం గుర్తించిన వ్యాపారస్తులవద్ద ఉండే ఉక్కు, ఇనుములను త్వరగా ప్రజలకు సప్లయి చెయ్యడానికి వినియోగపడే మార్గాలను సూచించడం, ప్రజలకు ఏయే సైజులలో ఇనుము ఉక్కు విశేషంగా కావలసిందీ కంట్రోలు వస్తువుల డైరెక్టరుకు సూచించడం, రాష్ట్రానికి నిర్ణయించబడిన కోటాలో వివిధ వస్తువులను తెప్పించడానికి వీలుగా ఏ యేరకాల వస్తువులు ఎంతెంత కావలసిందీ కంట్రోలు వస్తువుల డైరెక్టరుకు వివరంగా తెలియచేయడం ఈ సంఘం చేయవలసిన పనులు.

ఇనుము, ఉక్కు వస్తువులలో ఏయే రకాలు, ఏయే సైజులలో ఏయే ప్రాంతాలలో ఎంతెంతకావలసినదీ సిఫార్సు చేసే అధికారం, వ్యాపారస్తులు పంపించే నిలవసరుకు నివేదికలను అజమాయిషీ చేసే అధికారంకూడా ఈ సంఘానికి ఉంటవి. ఇనుము, ఉక్కు వ్యాపారస్తులలో ప్రభుత్వం ఎవరిని గుర్తించాలనే విషయంలోకూడా ప్రభుత్వం ఈ సంఘం సలహాలు తీసుకొంటుంది.

# రాయచోటి-అంగల్లు రస్తా

మద్రాసు, అగస్టు 1: దక్షిణభారత ఆటోమొబైల్సు సంఘంవారి ప్రకటన చేస్తున్నారు :

"చిత్తూరు జిల్లాలో రాయచోటి-అంగల్లు రస్తా 36-6 మైలువద్ద పెద్ద వానలవల్ల గండిపడింది. మరమ్మతుకు పదిరోజులు పడుతుంది. నెల్లూరు జిల్లాలో ఆత్మకూరు - సోమశిలరోడ్డు 4-2 మైలువద్ద ఆత్మకూరు వాసనాపురం రస్తా 5-8 మైలు వద్దను ఏరులలోని బాటలు వెళ్లడానికి వీలుగాలేవు. అయిదురోజుల్లో దారిసుగమంగావచ్చు ఉత్తర పెన్న వరదలవల చెన్నూరులో ఏటిబాటలో కడప కర్నూలురోడ్డు 108-5 మైలువద్ద నీటి మట్టం 3 అ. వున్నది. 12 రోజుల్లో ఏరుదాట సాధ్య పడవచ్చు. నెల్లూరు దగ్గిర పెన్న బాట గూడా అన్నిరోజులు మూసివుంచబడుతుంది.

# ఆత్మకూర్ సబ్‌తాలూకా రైతులకు రు 20 వేలు

## ఋణాలు మంజూరు

ఆత్మకూరు, జులై 26: కర్నూలు జిల్లా వ్యవసాయశాఖాధికారి ఆత్మకూరు సబ్ తాలూకాలో రైతులు వ్యవసాయ పనిముట్లు, విత్తనములు, ఎరువులు మొదలైనవి కొని వ్యవసాయాభివృద్ధి గావించేందులకుగాను రైతులకు దీర్ఘకాల వాయిదాలక్రింద 20 వేల రూపాయలు మంజూరుచేశారు. స్థానిక వ్యవసాయశాఖాధికారి శ్రీ శ్రీమన్నారాయణగారు సబ్ తాలూకాలోనివివిధ గ్రామాల రైతులనుండి రుణపు దరఖాస్తులు తీసుకొనుచున్నారు. (ఓ. వి.)

# చేనేతసంఘ తీర్మానాలు

పటమటలంక, జులై 27: ఆంధ్ర రాష్ట్ర చేనేత సంఘ కార్యవర్గం గత మూడు రోజులుగా సమావేశమై చేనేతకు తగిన నూలును సరఫరా చేస్తూ, చీరెలు, ధోవతులు, చేనేతకు పూర్తిగ కేటాయించాలనీ, మిల్లులకు న్యాయంగా గిట్టేట రేటుకే చేనేత పనివారికి నూలు గిట్టేట్లు సబ్సిడీ యిచ్చి నూలు వ్యాపారంలో మధ్యదళారులను తగ్గించాలనీ, ప్రైవేటు మిల్లుల నూలును చేనేతకిస్తూ నూలు కొనుగోలు మీద సబ్సిడీ యివ్వక తప్పదనీ తీర్మానించింద.

# బాలికను బలాత్కరించిన నేరానికి శిక్ష

బళ్లారి, జూలై 29: కాలా పుడ్డీన్ అను 20 సం॥ల యువకుడు 8 సం॥ల బాలికను బలాత్కరించిన నేరానికి గాను అతనికి జిల్లాజడ్జిగారు 4 సం॥ల కఠినశిక్ష విధించారు.

# రవాణాశాఖ కార్యదర్శుల ఉత్తర్వులు

## రిట్ దరఖాస్తు త్రోసి వేస్తూ హైకోర్టు తీర్పు

గుంటూరు, జూలై 30: కృష్ణాజిల్లా ప్రాంతీయ రవాణా అధికార సంఘ కార్యదర్శి, కేంద్ర రోడ్డు ట్రాఫిక్ బోర్డు కార్యదర్శి, ఆంధ్ర ప్రభుత్వం జారీచేసిన ఉత్తరువులను రద్దు చేస్తు, రిట్ సెర్టిరాయ్ జారీచేయవలెనని, మొదటి ప్రతివాది 1954 జూలై 19 తేదీ జారీచేసిన ఉత్తరువులు, ఈరిట్ దరఖాస్తు పెండింగులో ఉన్నంత కాలము అములులోకి రాకుండా ఉత్తరువులు జారీచేయించవలెనని కోరుతూ, దాఖలు కాబడిన దరఖాస్తును హైకోర్టు న్యాయమూర్తి శ్రీ చంద్రారెడ్డి గారు త్రోసివేశారు.

దరఖాస్తుదారు రామినేని బుచ్చిబాబు (కృష్ణాజిల్లా వుయ్యూరు వాస్తవ్యులు) గారి తరఫున ఇలా వాదింపబడింది.

రామినేని బుచ్చిబాబు కృష్ణా జిల్లా గన్నవరం మేడూరు మధ్య తిరుగుతుండే ఎ. డి. కె. 1828 (ఇప్పుడు ఎం. డి. కె. 2535) బస్సు యజమాని. కృష్ణాజిల్లా ప్రాంతీయ రవాణాధికార సంస్థ కార్యదర్శి, సదరు బస్సు యజమాని పర్మిట్ తాత్కాలికంగా రద్దు చేశారు. కృష్ణాజిల్లా అసిస్టెంటు పోలీసు సూపరెంటెండెంటు సాయంత్రం 6-45 గంటలకు తను బస్సు తనిఖీ చేసినట్లు, బస్సులో 18 పెద్దవాళ్ళను, 8 మంది పిల్లలను ఓవర్‌లోడ్ చేసినట్లు ప్రయాణీకులకు టిక్కెట్లుగాని, ట్రిప్ షీటు గాని లేనట్లు, ఆయన చేసిన ఆరోపణను ఆధారం చేసుకొని ప్రాంతీయ రవాణాధికార సంస్థ కార్యదర్శి, నీపై చర్య లందుకు తీసుకోకూడదో సంజాయిషీ చెప్పవలసిందిగా బస్సు యజమానికి నోటీసు జారీచేశారు. తనపై ఆరోపణలు అసత్యములని బస్సు యజమాని సంజాయిషీ పంపారు.

అంతట ప్రాంతీయరవాణాధికారసంఘ కార్యదర్శి బస్సు పర్మిట్ ను 3 నెలలపాటు తాత్కాలికంగా రద్దుచేశారు. ఆ తిరువాత బస్సు యజమాని కేంద్రరోడ్ ట్రాఫిక్ బోర్డు కార్యదర్శి (ఒక ప్రతివాది) కి అప్పీలు చేసుకోగా ప్రాంతీయ రవాణాధికార సంఘ కార్యదర్శి ఉత్తర్వు నేఖాయపరచారు. ఆపైన ఆంధ్రప్రభుత్వానికి రివిజన్ దరఖాస్తు చేసుకోగా వారుగూడా దరఖాస్తు త్రోసివేశారు.

"కేవలం చెక్కింగ్ ఆఫీసు, (అసిస్టెంటు పోలీసు సూపరెంటెండెంటు) గారి రిపోర్టుపై ఆధారపడి పై ట్రిబ్యునల్సు అక్రమంగా వ్యవహరించాయి. ఆయన రిపోర్టు మినహా, వ్రాతపూర్వకంగాగాని మరోవిధంగాగాని, ఇంకో సాక్ష్యాధారంలేదు. తనిఖీలోగూడా మామూలు ఆచారములు పాటించలేదు ట్రిప్ షీటుమీద సంతకంచేయడంగాని డ్రైవరు, కండక్టర్ల సంతకాలతో ఆ ట్రిప్ షీటు స్వాధీనం చేసుకోవడంగాని చేయలేదు. ఇలా అయినటయితే బస్సు నిర్వాహకులు కేవలం తనిఖీ అధికారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసి ఉంటుంది. కాబట్టి పై ఉత్తర్వులను రద్దుచేయాలి" అని దరఖాస్తుదారుని తరపున వాదించబడింది. దరఖాస్తుదారుని తరఫున అడ్వొకేటు శ్రీ కె. సూర్యనారాయణగారు వ్యవహరించారు.

# జైనదేవాలయంలో హరిజన ప్రవేశం

ఇండోర్, జూలై 31: ఇక్కడికి 20 మైళ్లలోగల బనోదియా గ్రామంలోని జైనదేవాలయంలో నిన్న హరిజనులకు ప్రవేశమిచ్చారు. 60 మంది హరిజనులు మహాత్మాగాంధీకి జై అంటూ ఆలయంలోకి వెళ్లారు. యీ సంస్థానంలో హరిజనులకు ప్రవేశమిచ్చిన మొదటి జైనదేవాలయం ఇదే.

# సినిమాగేటు కాపలా వానిపై దౌర్జన్యం

తిరుపతి, జూలై 30: స్థానికంగా గల ఒక సినిమాహాలు స్త్రీల గేటులోంచి లోపలికి పోనిమ్మంటూ, గేటు కాపలా వానిని కొట్టారనే నేరారోపణమీద సబ్ ఇన్ స్పెక్టర్ వెంకటస్వామిగారు 5 మందిని అరెస్టుచేసి రిమాండులో ఉంచారు. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

# బందరు పట్టణ కాంగ్రెసు సభ

బందరు, జూలై 30: బందరు పట్టణ కాంగ్రెసు కమిటీ మహాజనసభ నిన్న సాయంకాలము అధ్యక్షుడు రాళ్ళపల్లి అచ్యుత రామయ్యగారి అధ్యక్షతను జరిగింది. పట్టణసంఘం తరఫున నాలంటీరు దళమును ఏర్పాటుచేయుటకు తీర్మానించడమైనది.

# మంత్రుల పర్యటనలో పోలీస్ దళాలు

## అనవసరమని-ఉపముఖ్య మంత్రి అభిప్రాయం

తిరుపతి, అగస్టు 1: అతి వేగంగా వెళ్లే మంత్రుల మోటారుకారులకుదాలా వెనుక పోలీసుదళాల జీపులలోనో, వానులలోనో వెళుతుండే పద్ధతివల్ల ప్రయోజనమేమీ కనిపించడంలేదు కాబట్టి ఇట్టి ఆచారాన్ని మానివేయవచ్చునని ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి గారు అన్నారు. ఈ విషయం పరిశీలించవలసిందిగా కోరుతూ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ శ్రీ మోనప్పగారికి వ్రాశామనికూడా ఉపముఖ్యమంత్రిచెప్పారు.

# మద్రాసు వార్తలు

## విశారద తరగతులు

మదరాసు, జూలై 29: ఆదర్శ హిందీ ప్రేమీమండలి యీ జనాబ్య మునకు సెప్టెంబరు 6 వ తేదీనుండి విశారద, ప్రిలిమినరీ తరగతులు కొత్తగా జరుపబడగలవు. ప్రవేశిక, విశారద ప్రిలిమినరీ, బి. వి. హిందీలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రవేశం ఒసగబడును. ఆగస్టు 25 వ తేదీలోగా దరఖాస్తులు ఎగ్మూరు హైరోడ్డు నెం. 3 పందిలి పైసంస్థ కార్యదర్శికి అందజేయాలి.

## "దుర్గాదాసు" నాటక ప్రదర్శనం

మద్రాసు, అగస్టు 2: శ్రీ నన్నూరి ఆంధ్రమహాసభ సభ్యులు నిన్న సాయంత్రం ఎగ్మూరు, మ్యూజియం థియేటరులో "దుర్గాదాసు" చరిత్రాత్మక నాటకం ప్రదర్శించారు. ఔరంగజేబుగా ఎస్. వి. రమణారావు, దుర్గాదాసుగా వి. రామయ్య, దిలేర్ ఖాన్ గా ఎ. సి. బాబు, రాణీ మహామాయగా శ్రీమతి రమాదేవి, గుల్నార్ బేగంగా ఎస్. రమాదేవి ప్రశంసనీయంగా నటించారు.

## కార్పొరేషన్ బ్యాండు

మద్రాసు, అగస్టు 1: మద్రాసు కార్పొరేషను కర్నాటక బ్యాండు మేళం రోజు సాయంత్రం 5½-7½ మధ్య 2 వ తేదీ మెరీనా ఆ. జ. కచేరీ ఎదురుగాను, 3 వ తేదీ పాకాశ్పత వేణుగోపాలచెట్టి పార్కులోను 4 వ తేదీ తండియార్పేట త్యాగరాయచెట్టి పార్కు వద్దను, 5 వ తేదీ సెల్లాల రేశాంపేట జి. ఎస్. చెట్టి పార్కు వద్దను, 6 వ తేదీ మెరీనా కాసెల్ హౌస్ ఎదురుగాను, 7 వ తేదీ వాషర్ మెన్ పేట్ చివర సముద్రతీరమున కచేరీ చేస్తుంది.

## ఆంధ్ర సంక్షేమసలహా సంఘ అధ్యక్షురాలి పర్యటన

మద్రాసు, అగస్టు 1: ఆంధ్రరాష్ట్ర సంక్షేమ సలహాసంఘ అధ్యక్షురాలు శ్రీమతి ఎ. సి. కృష్ణరావుగారు అగస్టు 3 వ మద్రాసులో బయలుదేరి ఆ నాడు కడప, 4 గుంతకల్లు, అనంతపురం, 5 అనంతపురంలో బయలుదేరి 6 విజయవాడ, 7 శ్రీకాకుళం, 8 విశాఖపట్నం 9 వ బయలుదేరి 10 కి మద్రాసు చేరుకుంటారు.

## రాకపోకలు

మద్రాసు, అగస్టు 1: ఆంధ్ర రెవెన్యూబోర్డు ప్రథమ సభ్యుడు కె. ఎం. ఉన్నితన్ గారు గతరాత్రి ఏలూరు వెళ్ళారు.

ఆంధ్ర పబ్లిక్ సర్వీస్ కమీషను సభ్యుడు ఎం. ఎ. వెంకటరమణ నాయుడుగారు నిన్న విజయవాడ నుంచి మద్రాసు వచ్చారు.

క్రీడారంగం:

# ఫుట్ బాల్ పోటీలో మధ్యభారత్ పై హైదరాబాద్ విజయం

## అస్సామ్ సర్వీస్ జట్టుల పోటీ "డ్రా"

మద్రాస్, అగస్టు 2: ఈ యేడాది సంతోష్ ట్రోఫీను గెల్చుకొంటుందని అందరు అనుకొంటున్న హైదరాబాదు జట్టు చిన్న సాయంత్రం మధ్య భారత్ తో పడిన మొదటి పోటీలో 6.1 గోలులతో ఘనవిజయం సాధించింది. ఈ 6 గోలుల్లో 4 రైటిన్ లయాన్ చేసినవే. మొయిదాన్, దొరస్వామి చెరొకటి చేశారు. ఈ ఇద్దరు రైటేట్ పొజిషన్ లో ఆడుతూవుండగానే ఈ గోలులు చేశారు.

మధ్య భారత్ జట్టుకూడా బాగానే ఆడింది కాని, హైదరాబాదుతో వారి ...

సర్వీసెస్ జట్టు ఉత్తరాభిముఖంగా ఆట ఉపక్రమించింది. అందరూ అనుకొన్నట్లు వారి పురోగామి శ్రేణి చురుకుగా, చాకచక్యంతో ముందంజవేయసాగారు. కాని దత్తా, దాస్, తాము గోలుముందు ఒక గోడలాగా నిలబడ్డారు. వారి ముందు వారు బురుజుల్లాగా వొదుకువచ్చి ఈ శ్రేణి గమనాన్ని విచ్ఛిన్నం చేసివేశారు. దానితో సర్వీసెస్ ఆట కుంటుపడిపోయింది. కలంపింగ్ కు బంతి దొరకటమే దుర్లభమైపోయింది. మోన్, పెరీలకు కూడా ...

రేడియో వ్యాఖ్యానం

బెంగాల్ జట్టు

ఆసియా బాడ్మింటన్ లో భారత జట్టు గెలుపు

అసాం-సర్వీసెస్ పోటీ డ్రా

శ్రీ వి.వి.జి.రాజు పర్యటన

# "రాష్ట్రాభివృద్ధి పథకాలకు ప్రజలంతా పెట్టుబడి సమకూర్స్తే"

## రాజమండ్రి గౌతమీ వాణిజ్యమండలిలో ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షుని ఉద్బోధ

రాజమండ్రి, జూలై 31: ఆంధ్రులంతా దీక్షతో కృషిచేసి ఏటేటా రెండుమూడుకోట్ల రూపాయలు నిలవచేసి రాష్ట్రాభివృద్ధి పథకాలకు పెట్టుబడి సమకూర్చితే, ఆంధ్రరాష్ట్రం సత్వరంగా సర్వతోముఖంగా అభివృద్ధి చెందగలదని గౌతమీ వాణిజ్యమండలి ప్రథమ వార్షిక సభకు అధ్యక్షత వహిస్తూ ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షుడు జె వి సోమయాజులుగారు అన్నారు.

...

నిలవచేసి యీ అభివృద్ధి పథకాలలో పెట్టుబడి పెడితే పదిసంవత్సరాలలో 20-25 కోట్ల పెట్టుబడితో ఆంధ్రరాష్ట్రం పురోగమించగలదు."

శ్రీ శేషగిరిరావుగారు గౌతమీ వాణిజ్యమండలి గురించి ముచ్చటించిన తర్వాత సభ ముగిసింది. (స్వ. వి.)

## పర్షియా నూనె సమస్య పరిష్కారం

### పరిహారం విషయంలో కూడా ఒప్పందం

టెహ్రాన్, అగస్టు 1. ఇరాన్ కు, ఆంగ్లో-ఇరానియన్ నూనెకంపెనీకి పరిహారాన్ని గూర్చి ఏర్పడ్డ తగాదా నేడు పరిష్కారం అయిపోయింది. 30 మిలియన్ల పౌనుల లోపుగా ఈ పరిహారం నిర్ణయింపబడినటు, ఇరాన్ ఆర్థిక మంత్రి డా॥ అలీఅమనీ నేడు పేర్కొన్నారు.

ఇరాన్ లో నూనెగనులను ఇరానియన్ కంపెనీ నడపడం ప్రారంభించిన మూడు సంవత్సరాల అనంతరం 10 సంవత్సరాలలోపల ఈ పరిహారాన్ని చెల్లించడం ప్రారంభం అవుతుందని, రేపు మంగళవారంనాడు ఈ పరిహారాన్ని గూర్చి అన్ని వివరాలు ప్రకటింపబడతాయని గూడా ఆయన ఈ సందర్భంలో పేర్కొన్నారు.

"మన తెలుగు దేశంలోని భాగ్యవంతులు తమ భాగ్యాన్ని తమ అభివృద్ధికీ ఆంధ్రరాష్ట్ర పురోగమనానికీ వినియోగిస్తేనేగాని మనకు మంచి భవిష్యం వుండదు. ...



అమెరికాలో పలు విశ్వవిద్యాలయాలలో సాంఘికవిద్యా విషయాలపై ప్రసంగాలు చేయటానికి ఫుల్ బ్రైట్ (ప్రొఫెసర్ డాక్టర్ ఈజెనీ పి. లింక్ పిల్లలతోపాటు గతవారం బొంబైకి వచ్చినప్పటి ఫోటో.

# సమాజవికాస కార్యక్రమ ఆచరణ పద్ధతులు

## రాజధానిలో ప్రభుత్వ ప్రధానాధికారుల వివిధ శాఖల కార్యదర్శుల సభలో సమీక్ష

కర్నూలు, అగస్టు 31: ఈ వేళ ఉదయం ఆంధ్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఓ. పుల్లారెడ్డిగారి అధ్యక్షతన ఆంధ్ర ప్రభుత్వానికి చెందిన వివిధ శాఖల కార్యదర్శులూ, ప్రధానాధికారులూ శాసనసభా భవనంలో సమావేశ...

... గురించి ఈ సమావేశంలో చర్చించారు.

ప్రాజెక్టు ప్రాంతాలలో సిబ్బంది అవసరాలేమిటి? పనుల అజమాయిషీ ఎంతబాగా జరుగుతున్నది? అజమా...

## 'తిరుత్తణి నిర్వివాద ఆంధ్రప్రాంతం'

### తమిళుల వాదనపై శ్రీ దొరస్వామిచెట్టి ఖండన

... దరహిత మైన ఆంధ్ర ప్రాంతమని, ఇచటి ఆరాధ్యదైవమైన శ్రీ వెంకటేశ్వరాయస్వామివారు తమిళులకు చెందిన వాడని తమిళులు చేసేవాదన అర్థరహితమైనదనీ, యీ ఆలయాన్ని శ్రీ కార్వేటినగరం మహారాజావారి వంశీయులు కట్టించిన నిదర్శనాలు కలవనీ, శ్రీదొరస్వామి శెట్టిగారు (ప్రదేశ్ కాంగ్రెసు సభ్యుడు) ఒక ప్రకటన చేస్తున్నారు. అందులో యింకా యిలా పేర్కొన్నారు.

"తిరుత్తణి గురించి తరుచు ఆవేశపూరితులైన భాషావాదులు చేసే ప్రకటనలు చూస్తే ఆంధ్రుల విషయంగురించి తెలియబరచాలన్న కోర్కె కలిగినది. తమిళనాడు ఉత్తర సరిహద్దు కమిటీవారి కొన్ని అసంబద్ధ ప్రకటనలను విమర్శించవలసివున్నది.

1931 జనాభా లెక్కల ప్రకారం తెలుగువారిసంఖ్య 58% పోతే, గత 20 సంవత్సరాలుగా యితరులు యిచటికి వలసరావడం మూలంగా, కొంచెం సంఖ్య తగ్గినట్లు భావించినా, కాతం హెచ్చుకావలసివున్నది. గ్రామకరణాలు తమిళులు. ఎన్నికల జాబితాలు వారే తయారుచేశారు.

చిత్తూరుజిల్లాలో అత్యధిక సంఖ్యాకులు తెలుగువారైనప్పటికీ, అల్పసంఖ్యాకులైన తమిళులకు తమిళంలోనే బోధించే సౌకర్యాలు చాలా హైస్కూళ్ళలో కలిగించబడినవి. ఈ ఉద్యమానికి నాయకుడైన వినాయకంగారే తమ స్కూలు జీవితంలో తెలుగులోనే బోధనకు ప్రాముఖ్యమిచ్చిన సంగతి విమర్శించరనకుంటా.

మద్రాసు రాష్ట్రవిభజనకు పూర్వం జిల్లావుద్యోగులు తమిళుల సహకారంతో అనేక తెలుగుపాఠశాలలను మూయించి వేశారు.

ఇక తిరుత్తణి పంచాయితీ తమిళుల చేతిలోవున్నది. నాయకులనబడే వారి సలహాల ననుసరించి వ్యవహారాలన్నీ నడుపుతున్నారు. ప్రజల అవసరాలకై వుపయోగించే రేడియోను పాడుచేసే దాకా యీ వ్యవహారం నడిచింది. రేడియో ప్రోగ్రాములన్నీ తమిళ సేషనులనుండి వచ్చేవే. ఇది ప్రజలకు చాలా అసౌకర్యంగా వుంటున్నది.

ప్రవాసీవకులైన ఆంధ్ర నాయకులపైన, ఆంధ్రమంత్రులపైన నీచాతినీచమైన ఆరోపణలను యీ నాయకులనబడువారు చేస్తున్నారు. ఆంధ్రప్రభుత్వం చాలా వుదారవైఖరి నవలంబిస్తున్నదని చెప్పక తప్పదు. తిరుత్తణి ఆంధ్రులు స్వరాష్ట్రంలోనే తప్పదారిబట్టిన పంచాయితీ చర్యలవలన చెప్పించి బాధలనుభవించడం ఆందోళనకరమైన విషయం.

గత ఎన్నికలలో తమిళనాడు ఉత్తర సరిహద్దు కమిటీవారు నిలబెట్టిన తమిళ అభ్యర్థిని అధిక మెజారిటీతో ప్రత్యర్థి వోడించాడు.

కనుక యీ నిదర్శనాల వలన తిరుత్తణి వివాదరహితమైన తెలుగు ప్రాంతమని తేలుతున్నది. డబ్బుకోసం జరిగే దుష్ప్రచారం బట్టబయలుచేసి యథార్థం అందరికీ బోధపడేట్లు చేయాలని అందరకు విజ్ఞప్తి చేస్తున్నాను."

## కొరియాలో తటస్థ ప్రతినిధులపై కాల్పులు

### హోటలులో సంఘటన

## మదరాసు ధరలు

మదరాసు, అగస్టు 2:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ

| | |
|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. 58 2-0 |
| పెట్టాబంగారం తులం | రు. 88 2-0 |
| మూస బంగారు | రు. 86-12 0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. 156-0-0 |
| చిల్లర ధర | రు. 1-10-0 |

వేరుశనగ

(531 పౌ॥ 1-కి ఎక్సుశోస్తా గిడ్డంగులు మెషీన్-సేల్సుటాక్సుతో సహా)

| | |
|---|---|
| | రు. 132-134-0-0 |
| వేరుశెనగనూనె ఎక్సు పెల్లర్ బిలో 8% (500పౌ.) రెడి చిల్లరధర | రు. 249-0-0 |
| కొంకాయనూనె (87½ పౌనులు) | |
| అంబుమార్కు | రు. 29-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 29-8-9 |
| రాజా బ్రాండ్ | రు. 28-8-9 |

ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పౌ) | రు. 200-0-0 |

పంచదార

| | | |
|---|---|---|
| ప్యారీ | (2 అందరు) | 84-0-9 |
| జపాన్ | (66 పౌ) | 25-0-9 |
| జర్మనీ | (223 పౌ) | 81-0-9 |

## తాడేపల్లి గూడెంలో ధాన్యం బియ్యం ధరలు

తాడేపల్లి గూడెం, అగస్టు 1: ఈవేళ యిక్కడ ధాన్యం, బియ్యం ధరలు యీ విధంగా ఉన్నవి.

ధాన్యం: (166 పౌన్లు బస్తా)

| | |
|---|---|
| అక్కుళ్ళు | 20-8-0 |
| గరికసన్నాలు | 19-8-0 |
| నల్లార్లు (దాళ్వ) | 17-8-0 |
| కృష్ణకాటుకలు | 21-0-0 |
| సన్నకృష్ణకాటుకలు | 21-8-0-22 |
| కిచిలీసాంబాలు | 22-8-0 |
| బంగారు తీగలు | 26-0-0 |

ఎగుమతి బియ్యం (164 పౌన్లు బస్తా)

| | |
|---|---|
| అక్కుళ్లు | రు. 30-8-0 |
| గరికసన్నాలు | 28-0-0 |
| కృష్ణకాటుకలు | 32-0-0 |
| సన్నకృష్ణకాటుకలు | 33-0-0 |
| కిచిలీసాంబాలు | 34-0-0 |

బియ్యం: (రోగుమతి) సంచితో ప్యాసు 164 పౌన్లు

| | |
|---|---|
| అక్కుళ్లు | 32-12-0 |
| గరికసన్నాలు | 31-0-0 |
| నల్లార్లు(దాళ్వ) ఎర్రవి | 25-8-0 |
| కృష్ణకాటుకలు | 36-0-0 |
| సన్నకృష్ణకాటుకలు | 36-8-0 |
| కిచిలీసాంబాలు | 36-8-0-37 |
| బంగారుతీగలు | 41-0-0-42 |

ఉప్పుడు బియ్యం: రోగుమతి సంచితో ప్యాసు 164 పౌన్లు బస్తా

| | |
|---|---|
| గరికసన్నాలు | |
| Ready R. R. (రోగుమతికి సిద్ధంగా యున్నవి) | 34-0-0 |
| Forward R. R. (జట్టీ పద్ధతి) | 33-0-0 |
| నల్లార్లు (దాళ్వ) | |
| Ready R. R. (రోగుమతికి సిద్ధంగా యున్నవి) | 33-0-0 |
| (జట్టీ పద్ధతి) | 31-8-0 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, అగస్టు 2: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 153-7-0 |
| బంగారం (1 తు.) | 86-11-0 |
| సావరిన్ | 57-4-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: కలకత్తా వెండిబంగారు మార్కెట్ నేడు మూయబడినది.

## రేడియో

బుధవారం, అగస్టు 4

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా, 7-15 మద్రాస్ (బి) వలె 7-30 మద్రాస్ వలె 8 అంగ్లమున వా.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1 (బి) వలె 1-30 (ఎ) వలె 1.40 హిందీలో వా. 1-50 తెలుగున వా. 2 (బి) వలె 2-15 ఉన్నత పాఠశాలలకు.

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 5-30 చేరి సుబ్బారావు (వ) 6 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6 25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగున వా. 7-15 పురాణ కాలక్షేపం 7-30 (రి) 7-45 బుద్ధ (ప్రసంగం) 8-20(బి) వలె 8-30 నేషనల్ ప్రోగ్రాం 8-50 (రి) 9 అంగ్లమున వా. 9-15 భజన్ (రి) చేరి సుబ్బారావు (వ) 10 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా. 7 30 ఆర్. శివుంతల వీణ 8 అంగ్లమున వా.

మ॥ 12-30 పాఠశాల (రి) 1 మహిళామండలి (రి) 1-30 (రి) 1-40 హిందీలో వా. 1-50 (రి) 2 తమిళమున వా. 2-10 (బి) వలె 2-15 పాఠశాల (రి).

సా॥ 4 పాఠశాల (రి) 4-30 ...

హైదరాబాద్

ఉ॥ 6-55 ...

సా॥ 5-30 ఖయాల్, 6 కన్నడ కార్యక్రమం, 6-30 (రి), 6.40 స్థానిక ప్రకటనలు, 6-45 భిక్షునిర్యాణము- హరికథ, 7 తెలుగు వా, 7-15 హరికథ (2 వ భాగ॥), 7-45 కన్నడ వా, 8 సుకన్యాత్రి- నాటిక ఎ. వి. రాజేశ్వరరావు, 8-30 నేషనల్ ప్రోగ్రాం, 8-50 భజన్, 9 అంగ్ల వా, 9-15 ఉర్దూ వా, 9-30 టి. టి. సీత, 10-30 ప్రసార సమాప్తి.







Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.